జరపడంలోనూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. గత ఆర్థికసంవత్సరంలో ఇళ్ళ స్థలాల పంపిణీ నిమిత్తం నిధుల కేటాయింపును రు. 500 లక్షలకు పెంచారు. స్థలాలను అభివృద్ధి పర్చడం, కట్టడాల నిమిత్తం మరో 100 లక్షలు కేటాయించారు. ఇప్పటివరకు రాష్ట్రంలో 11 లక్షల ఇళ్ల స్థలాలను పంపిణీ చేశారు. లాభంపొందిన వారిలో 40 శాతం మంది వెనుకబడిన తరగతుల వారు ఉన్నారు. దీనికి తోడు, స్థలాలు కేటాయింపు పొందినవారు ఇళ్లు నిర్మించుకోడానికి వీలుగా సహాయం చేయడానికి మేము ఒక బృహత్తర ఇళ్ల నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించాము. దిగువ తెలిపిన ఇళ్ళ నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించి, అమలు జరుపుతున్నాము.

1. 1979 మే ఆఖరునాటికి 1,25,000 కుటుంబాలకు లాభించే విధంగా విశాఖపట్నం, కర్నూలులో జరిపిన పద్ధతిలో ఇళ్లస్థలాలు—సేవల కార్యక్రమం.
2. గృహ నిర్మాణం, పట్టణాభివృద్ధి కార్పొరేషన్ (హుడ్కో), జీవితభీమా సంస్థ (ఎల్. ఐ. సి.), సాధారణ భీమాసంస్థ (జి.ఐ.సి.) వంటి సంస్థాగత వ్యవస్థల రుణసహకారంతో 50,000 కుటుంబాలకు లాభించే విధంగా గ్రామీణ శాశ్వత గృహ నిర్మాణ కార్యక్రమం.
3. సంస్థాగత వ్యవస్థల రుణసహాయంతో 50,000 కుటుంబాలకు లాభించే విధంగా పట్టణ ప్రాంత శాశ్వత గృహనిర్మాణ కార్యక్రమం.
4. సంస్థాగిత వ్యవస్థల రుణసహాయంతో నేతపనివారలు, మత్స్యపారిశ్రామికుల, ఇతర వృత్తి పనివారల సహకార సంఘాల ద్వారా శాశ్వత గృహనిర్మాణ కార్యక్రమం.

ఇళ్ళస్థలాలు—సేవల కార్యక్రమంలో దిగువ అంశాలు ఉన్నాయి:

1. ఇళ్లస్థలాల సేకరణ—వాటి అభివృద్ధి
2. పౌరసౌకర్యాలు, రోడ్లు, డ్రైనేజి, మంచినీరు, వీధి దీపాలవంటి సౌకర్యాలు.
3. తక్కువ ఖర్చుతో కూడిన తాత్కాలిక కట్టడాలు నిర్మించుకోడానికి సహాయం.
4. లాభం పొందిన వారు ఆదాయం పెంపొందించుకోడానికి ఆర్థిక తోడ్పాటు పథకం.

సాంఘిక సంక్షేమశాఖ గ్రాంట్ల నుంచి, పంచాయతీ రాజ్ సంస్థలు కేటాయించిన నిధుల నుంచి పౌరసౌకర్యాలు కల్పిస్తున్నారు దానికితోడు, పనికి ఆహారం పథకంతో ఈ కార్యక్రమాలను అనుబంధంగా అమలు జరుపుతున్నారు. ఇళ్ళ నిర్మాణానికి ఆర్థిక సహాయాన్ని ఇళ్ళ నిర్మాణ వస్తువుల రూపంలో రు. 200/–లు. పనికి ఆహారం పథకం క్రింద రు. 200/– స్థిరీకరించారు. అంతేగాక రాయితీ రేట్లపై వెదురు గడలు సరఫరాచేయడానికి 1979 మార్చి 5వ తేదీన ఉత్తర్వులు జారీచేశారు. అన్ని జిల్లాలలోనూ యీ కార్యక్రమం అమలు వేగాన్ని పుంజుకుంది.

జి.ఐ.సి. వారి రు. 50 లక్షల రుణ సహాయంతో అన్ని జిల్లాలలో ప్రయోగాత్మక గ్రామీణ శాశ్వత గృహనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టారు.

ప్రతి యూనిట్టు ఖర్చు రు. 4000/–ల చొప్పున రు. 25,000 ఖర్చుతో కూడిన గ్రామీణ శాశ్వత ఇళ్ళ నిర్మాణ పథకాన్ని హుడ్కోకు సమర్పించారు. సాంకేతిక పరంగా యీ పథకాన్ని ఆమోదించారు. ఉత్తర్వుల కోసం వేచి ఉన్నారు.

పట్టణ గృహ నిర్మాణ పథకానికి సంబంధించినంతవరకు అన్ని పట్టణాలు, మునిసిపల్ ప్రాంతాలలో కలక్టర్లు పథకాలు రూపొందించారు. రు. 289.90 లక్షల రుణంతో 6 026 ఇళ్లు నిర్మించే ప్రతిపాదనలను హుడ్కోకు సమర్పించారు. సాంకేతిక పరంగా యీ ప్రతిపాదనలను ఆమోదించారు. ఉత్తర్వుల కోసం వేచిఉన్నారు.

బలహీనవర్గాలు ముఖ్యంగా వెనుకబడిన తరగతులకు చెందిన నిరుద్యోగులైన యువతీయువకులకు ఉపాధి కల్పించడానికి ప్రభుత్వం కొత్త పథకాలు ప్రారంభించింది. గత సంవత్సరం ప్రారంభించిన ప్రత్యేక ఉపాధి పథకం అప్పుడే ఫలితాలను యివ్వడం ప్రారంభించింది. మార్జిన్ పెట్టుబడి ధనం, సంస్థాగత సహాయం, ప్రాతిపదిక సౌకర్యాల కల్పన ద్వారా 7,5000 మంది నిరుద్యోగులు, పాక్షిక నిరుద్యోగులకు లాభసాటి అయిన ఉపాధి లేదా వృత్తి కల్పించారు.

మిగులు భూముల పంపిణీ, పంచాయతీరాజ్ సంస్థలు, మునిసిపాలిటీలలో కొన్ని సీట్ల రిజర్వేషన్ వంటి వివిధ యితర కార్యక్రమాలను కూడ అమలు జరుపుతున్నారు. వెనుకబడిన తరగతుల ప్రజల సంక్షేమం నిమిత్తం ప్రస్తుత ప్రభుత్వం ఈ సంవత్సరం బడ్జెటులో అదనంగా రు. 230 లక్షలు కేటాయించడం ద్వారా బడ్జెటులో యీ పద్దు క్రింద రు. 710 లక్షలు కేటాయించారు. సమాజంలోని యీ బలహీన వర్గాల సంక్షేమానికి ప్రభుత్వం అమలు జరుపుతున్న కృషితో పాటు ఈ విషయంలో అన్ని వర్గాల ప్రజల సంపూర్ణ సహాయం చాలా అవసరం. ఈ రంగంలో మేము సాధించిన ఫలితాలు గణనీయంగానే ఉన్నప్పటికి, వచ్చే సంవత్సరాలలో ద్విగుణీకృత ప్రోత్సాహంతో మరింత ఎక్కువ కృషి జరపాలని మేము కృతనిశ్చయింతో ఉన్నాము. వెనుకబడిన తరగతుల దారిద్ర్యం అజ్ఞానం సమూలంగా నిర్మూలించబడి, ఎటువంటి అడ్డంకులు, అసమానతలు లేకుండా తోటి ప్రజలతో కలిసి సమాన స్థాయిలో వారు కూడ ముందడుగు వేస్తారని నేను ఆశిస్తున్నాను.

# మన రాష్ట్రంలో వెనుకబడిన తరగతుల సంక్షేమం

కె. వి. ఆర్. ఎస్. పద్మనాభరాజు*

మన దేశ జనాభాలో అత్యధిక సంఖ్యాకులు బలహీన వర్గాలకు చెందిన వారు. కనుక సాంఘికంగా, ఆర్థికంగా, విద్యావిషయకంగా వెనుకబడిన తరగతులకు చెందిన ప్రజల సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రత్యేక నిబంధనలు చేసి వాటిని అమలు పర్చవలసిందిగా మన రాజ్యాంగంలోని 15 (4) పరిచ్ఛేదం నిర్దేశిస్తున్నది. దీనికి అనుగుణంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1968 లో వెనుకబడిన తరగతుల కమిషనును నియమించింది. ఆయా వెనుకబడిన తరగతులలో ఒక్కొక్క తరగతికి చెందిన ప్రజల సర్వసాధారణ బీదస్థితి, వారు అవలంబించే వృత్తులు, కులం, విద్యా విషయకంగా వెనుకబడిన తనం— మున్నగు అంశాలను దృష్టిలో ఉంచుకొని ఆయా వర్గాలకు చెందిన ప్రజల వెనుకబడినతనాన్ని నిర్ధారణ చేయాలని కమీషను నివేదించింది. ఈ అంశాలను దృష్టిలో వుంచుకొని ప్రభుత్వం 92 కులాలను వెనుకబడిన తరగతులుగా పరిగణించింది. దరిమిలా ప్రభుత్వం మరో 3 కులాలను కూడా వెనుకబడిన తరగతులుగా పరిగణించింది. ఇవి 4 వర్గాలుగా విభజింపబడ్డాయి. అయితే తెలంగాణా ప్రాంతంలోని ఎరుకల వారిని, లంబాడా వారిని వెనుకబడిన తరగతుల జాబితాలో నుంచి తొలగించి ఇటీవల షెడ్యూలు తెగల జాబితాలో చేర్చడం జరిగింది.

రాష్ట్రం మొత్తం జనాభాలో 40 శాతం కంటె ఎక్కువగా ఉన్న వెనుకబడిన తరగతుల వారి సంక్షేమం కోసం అనేక కార్యక్రమాలు రూపొందించి అమలుపర్చే నిమిత్తం మన రాష్ట్ర ప్రభుత్వం 1-7-1975 తేదీ లగాయతు ప్రత్యేకంగా ఒక శాఖను ఏర్పాటు చేసింది.

వెనుకబడిన తరగతుల వారి సంక్షేమం కోసం ప్రభుత్వం బడ్జెటులో ఇతోధికమైన మొత్తాలను కేటాయిస్తున్నది. ప్రస్తుత ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత కేవలం వెనుకబడిన తరగతుల వారి కార్యక్రమాల కోసం అదనంగా రూ. 230.00 లక్షల మొత్తాన్ని కేటాయించింది.

వెనుకబడిన తరగతుల వారి సంక్షేమ కార్యక్రమాలు స్థూలంగా ఈ క్రింది విధంగా ఉన్నాయి:

1. విద్యాపరమైన కార్యక్రమాలు
2. ఇళ్ళ స్థలాల కేటాయింపు, గృహవసతి సాముదాయక సదుపాయ కార్యక్రమాలు.
3. ఆంధ్ర ప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ చేపట్టిన కార్యక్రమాలు.

స్వాతంత్ర్యం సిద్ధించి మూడు దశాబ్దాలు గడిచినప్పటికీ వెనుకబడిన తరగతుల వారు విద్యారంగంలో ఆశించినంత పురోగతి సాధించలేదు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వం వృత్తి విద్యా కోర్సులలోను పోస్టుగ్రాడ్యుయేటు, అండర్ గ్రాడ్యుయేటు కోర్సులలోను 25 శాతం స్థానాలను రిజర్వు చేసింది. వెనుకబడిన తరగతుల వారి శీఘ్రతరమైన విద్యాభివృద్ధి కోసమే కాకుండా, వారికి ఉపాధి,అవకాశాలు ఇనుమడింప జేసే ఉద్దేశంతో ప్రభుత్వం సమకూర్చిన సౌకర్యాలలో స్కాలర్‌షిప్పులు, హాస్టలు వసతి, జాతీయ పాఠ్య పుస్తకాలు. నోటు బుక్కుల సరఫరా, రుసుం రాయితీలు మున్నగునవి కూడా చేరి ఉన్నాయి. వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలర్‌షిప్పుల నిమిత్తం ప్రభుత్వం 1979–80 బడ్జెటులో రూ. 225.97 లక్షలు కేటాయించింది. ఆశ్రమ పాఠశాలలకు చెందిన హాస్టళ్ళతో సహా ఇప్పుడు 378 ప్రభుత్వ హాస్టళ్ళు ఉన్నాయి. వీటిలో 31,665 మంది విద్యార్థులు ఉన్నారు. 1979–80 సంవత్సరంలో మరో 100 హాస్టళ్ళు ప్రారంభించాలని సంకల్పిస్తున్నాం. 25 మంది వెనుకబడిన తరగతుల అభ్యర్థులకు ఐ.ఏ.ఎస్. ఐ.పి.ఎస్. మున్నగు పరీక్షలకు హాజరయ్యేందుకై శిక్షణ ఇవ్వడానికి, 50 మంది వెనుకబడిన తరగతుల అభ్యర్థులు గ్రూపు I సర్వీసు పరీక్షలకు హాజరయ్యేందుకు శిక్షణ ఇవ్వడానికి తగు ఏర్పాట్లు జరిగాయి. ఉపాధి అవకాశాలు మెరుగుపర్చేందుకుగాను గ్రామాధికారులు, మోటారు డ్రైవర్లు, బెస్తవారు, దర్జీవారు మున్నగు వృత్తుల్లో కూడా శిక్షణ ఇవ్వడం జరుగుతున్నది. గ్రామాధికారుల పదవులలో ఖాళీలు ఏర్పడినపుడు

* సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి, ఆంధ్ర ప్రదేశ్.

నియామకం విషయంలో వెనుకబడిన తరగతుల వారికి ప్రాధాన్యం ఇస్తున్నారు.

రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలలో, పబ్లిక్ రంగ సంస్థల ఉద్యోగాలలో 25 శాతం ఉద్యోగాలు వెనుకబడిన తరగతుల వారి కోసం రిజర్వు చేయటం జరిగింది. నియామక అధికారుల కార్యాలయాలు, ఉద్యోగ వసతి కార్యాలయాలు మొదలైన వాటిని అప్పుడప్పుడు తనిఖీ చేసే నిమిత్తం అసిస్టెంటు కమీషనర్లను నియమించాం. విశ్వవిద్యాలయాలలోని బోధన, బోధనేతర సిబ్బందికి చెందిన ఉద్యోగాలలో సయితం ఈ రిజర్వేషను వర్తింప చేయడం జరిగింది.

వెనుకబడిన తరగతుల ప్రజలలో ఎక్కువ మంది పల్లె ప్రాంతాలలో నివసిస్తున్నారు. వీరికి సరియైన గృహ వసతి సౌకర్యాలు లేవు. అందుచేత ఇళ్ళ స్థలాల కేటాయింపు, ఇళ్ళ నిర్మాణం వంటి అంశాలకు అత్యధిక ప్రాధాన్యం ఇస్తున్నాం. ఇప్పటి వరకు 1,99,620 ఇళ్ళ స్థలాలు పంపిణీ చేశాం. క్రిందటి ఏడాదిలో ఇళ్ళ స్థలాల పంపిణీ నిమిత్తం రూ. 500 లక్షలు, స్థలాల అభివృద్ధి తదితర నిర్మాణ కార్యకలాపాల కోసం రూ. 100 లక్షలు కేటాయించారు. ఇళ్ళు పోతే వారు ఇళ్ళ నిర్మాణపు పనులలో స్వయంగా పాల్గొనేటట్లు చేయడంకోసం ఒక కార్యక్రమాన్ని రూపొందించి అమలు పరుస్తున్నాం. ఆయా వృత్తుల వారు తమ తమ అవసరాలకు అనుగుణంగా ఇళ్ళు కట్టుకోవడానికిగాను ఇళ్ళ డిజైనులను రూపొందించడం జరుగుతున్నది. రాయితీ రేట్లపై వెదుళ్ళు సరఫరా చేయడానికి వీలు కల్పించబడింది. జీవిత భీమా సంస్థ, గృహవసతి పట్టణాభివృద్ధి సంస్థ మున్నగువాటి సహాయంతో ఇళ్ళు నిర్మించడానికి పథకాలు రూపొందించి అమలు పరుస్తున్నాం.

వెట్టిచాకిరినుండి విముక్తులైన వారిపునరావాసంకోసం ప్రభుత్వం తక్షణ ఆర్థిక సహాయం అందజేస్తున్నది. అత్యాచారాలకు గురి అయిన వారికి న్యాయపరమైన సహాయం అందజేయడానికికూడా ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది.

వెనుకబడిన తరగతులవారికి ఆర్థిక సహాయం అందజేసే నిమిత్తం మన రాష్ట్ర ప్రభుత్వం ఒక కార్పొరేషనును ఏర్పాటు చేసింది. వెనుకబడిన తరగతుల వారి ప్రణాళికా బద్ధమైన ఆర్థిక అభ్యున్నతి కోసం ఈ కార్పొరేషను ఒక ప్రత్యేక సాధనంగా ఉపకరిస్తున్నది.

వెనుకబడిన తరగతుల వారిలో నిరుద్యోగులైన విద్యావంతులకు ఉపాధి కల్పించేందుకు ప్రస్తుత ప్రభుత్వం గడచిన సంవత్సరం ఆగస్టునెలలో ప్రత్యేక ఉపాధి కల్పనా పథకాన్ని ప్రారంభించింది. మౌలిక సదుపాయాలు, మార్జిను సైతం, సంస్థాగతమైన సహాయంవంటి సౌకర్యాలు సమకూర్చడం జరిగింది. సుమారు 75,000 మంది నిరుద్యోగులకు ఇందు మూలంగా ప్రయోజనం చేకూరింది.

స్వచ్ఛందంగా కులాంతర వివాహాలు చేసుకునే వధూవరులలో ఒకరు వెనుకబడిన తరగతులకు చెందినవారైతే ఆ దంపతులకు రూ. 500 లు ఇవ్వడం జరుగుతున్నది. సాంఘిక సమైక్యతా భావం పరిఢవిల్లడానికి ఈ చర్య ఎంతగానో దోహదం చేయగలదు.

తరతరాలుగా వెనుకబడిన తరగతుల ప్రజల జీవనస్థితిగతులు మెరుగుపర్చిన వారు అన్ని రంగాలలోను పురోగమించడానికి దోహదంచేసే నిమిత్తం మనరాష్ట్ర ప్రభుత్వం అనేక కార్యక్రమాలు అమలు పరుస్తున్నది. ఈ కార్యక్రమాలు సత్ఫలితాలనిస్తున్నాయి. ఇంతటితో తృప్తి పడకుండా మరింత సత్వరంగా అమలుపర్చే బృహత్తర కార్యక్రమాన్ని రూపొందించి అమలుపర్చాలని ప్రభుత్వం సంకల్పిస్తున్నది. ప్రభుత్వం సల్పే ఈ నిర్విరామ కృషికి ప్రజల సహాయ సహకారాలు లభించగలవని మన రాష్ట్రం వెనుకబడిన తరగతులవారి సంక్షేమ కృషిలో అగ్రగామిగా ఉండగలదని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను.

———

# నవచైతన్యానికి నాంది

అగిశం వీరప్ప*

ప్రభుత్వ పక్షాన వెనుకబడిన తరగతుల రాష్ట్రస్థాయి మహాసభలు జరగడం—మన రాష్ట్రంలోనేనాదు, మన దేశంలోనే ఇది తొలిపర్యాయం. ప్రప్రథమంగా ఇటువంటి చరిత్రాత్మక మహాసభలను జరపడం డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారి సృజనాత్మక నేతృత్వంలోని ప్రస్తుత ప్రభుత్వానికే గర్వకారణం.

రాష్ట్రంలోని వెనుకబడిన వర్గాల ప్రతినిధులందర్నీ ఒక వేదిక మీద సమావేశపరచి, సాధక బాధకాలను చర్చించి, ముందడుగు కోసం నిర్మాణాత్మక కార్యక్రమాన్ని రూపొందించుకోవడానికి ఈ మహాసభలు ఉద్దేశించబడినాయి. బలహీనవర్గాల ఆశాజ్యోతి శ్రీమతి ఇందిరాగాంధీ అన్నమాటను, వెనుకబడిన వర్గాలకు పెట్టని కోట ఇందిరా కాంగ్రెస్ అన్న పలుకునూ, బడుగు వర్గాలకు అండదండ డాక్టర్ చెన్నారెడ్డి అన్న విషయాన్నీ సార్థకపరుస్తూ విసూత్య అభ్యున్నతికి ఈసభలు వైతాళికగీతం ఆలపిస్తున్నాయి.

వెనుకబడినతనం నిర్వచనం :

'వెనుకబడిన తరగతులు' అన్నమాట ఈరెండుమూడుదశాబ్దాల నుంచీ ప్రాచుర్యంలో వున్నట్టిది. కానీ శతాబ్దాలనుంచి.... శూద్రులు,శూద్రుల్లోను నీచకులాలు, తక్కువజాతి మనుష్యులు, నాల్గవజాతివారు....ఇలాంటి మాటలు కోకొల్లలుగా,లిఖిత సారస్వతంలోకూడా ఎక్కి కూర్చొని వెక్కిరిస్తున్నాయి.

ఈ వెనుకబడిన కులాలుకానీ, వారి వెనుకబడినతనం కానీ సమాజం సృష్టించిన దౌర్జన్య వికృత రూపం. ఆధునిక చైతన్యం ద్విగుణీకృతంగా అల్లుకొంటున్న ఈ రోజుల్లోకూడా వెనుకబడిన వర్గాలు అంటూ కొందరు మిగిలిఉండడం, నిజంగా విశ్వమానవ కుటుంబానికే అవమానకరం.

'కృషి' అన్నది ఒకకళ. శరీర కష్టాన్ని మానవుని నిత్యజీవనానికి ఉపయోగకరంగా, ఎన్నోరకరకాల పనుల్లో వినియోగిస్తుంటాము. రెక్కల కష్టానితోడు, ప్రతిభను కూడా జోడించి సంఘానికి ప్రాతినిత్యమూ అవసరమయ్యే ఎన్నో విషయాలను కనుగొన్నారు. మొదట్లో అది కళ, తర్వాత అవసరం, ఆ తర్వాత కొంతమంది కలిసికట్టుగా ఆపనిలోనే నిమగ్నమై, తద్వారా జీవనోపాధి సంపాదించుకొంటే అదివృత్తి ఆతర్వాత కులం. ఇదిమన సమాజంలో ఏర్పడిన కులచక్రం.

వెనుక బడిన కులాలుగా మనం చెప్పుకొనే వాళ్ళను ఒకసారి నిశితంగా చూడండి. అందరూ ఏదో ఒకవిధంగా కళాకారులే. ప్రతిభతో పనితనం ముడి పడడమే కదా కళ.

పదిమందికీ పనికివచ్చే అవసరమయ్యే పనులను చేసేవారు కొందరు, వినోదాన్ని, ఉల్లాసాన్ని కల్పించడానికి కష్టించేవారు కొందరు, హస్తకళలను ప్రత్యేకించి చేసేవారు కొందరు: ఇలా అందరూ మానవ సంస్కృతి,నాగరికతల వికాసానికి ప్రాతినిధ్యం వహించేవారే అయితే వీరందరూ వెనుక బడినవారే.

సమాజంలో పెత్తందారీ వ్యవస్థ ప్రవేశించాక, పెత్తనాన్ని చేజిక్కించుకొన్న కొన్ని వర్గాలవారు, నిత్యవసరానికి కష్టపడే జీవుల్ని వెనక్కి నెట్టారు. వాళ్ళ కష్టార్జితాన్ని దోచుకొన్నారు. వర్ణవ్యవస్థను నిర్మించారు. కొందరు కేవలం సేవచేయడానికే పుట్టారన్నారు. వాళ్ళనైపుణ్యాన్ని, కళా ప్రతిభనీ ఊడిగంగా మార్చారు. హీనజాతులు అంటూ చలామణి ప్రసాదించారు.

వైదికధర్మం చాలాగొప్పది, మానవుని మేధా పరిశ్రమకు అంతిమ ఫలం భారతీయ వైదికతత్వం, కాని ఆ తత్వమార్గం ఒక మతంగా తయారయ్యాక, పెత్తందారీ వర్గాల చేతుల్లో పావుగా మారిపోయాక ఎన్నో కాలుష్యాలు చెలరేగాయి. ఆ కాలుష్యాలలో అతిదారుణమైంది కులవ్యవస్థ.

ఒక్కొక్కరకమైన పనిచేసేవాడు ఒక్కొక్కకులం. అందరి పనులూ అందరూ అనుభవించవచ్చు. అయితే అందరికీ కులాలు వుంటాయి.

ఒకసారి జాగ్రత్తగాచూడండి: అగ్రవర్ణాలుగా చెప్పబడేవారి మధ్యఎన్నికులాలు వున్నాయి? తక్కువవర్ణాలుగాచెప్పబడే వారి మధ్యకులాలు వున్నాయి?అత్యధిక శాతం ప్రజలునిత్యజీవనావసర నిర్మాతలు—అత్యధిక సంఖ్యాక కులాలుగా చీలిపోవడానికి కారణం ఏమిటి? దీనివెనకాల నక్కిన చారిత్రక సత్యం ఏమిటి?

* పౌర సరఫరాలశాఖామాత్యులు

కృషి

'కృషి' సృష్టించిన 'భిన్న' నైపుణ్యాలనీ కళలనీ కొల్లగొట్టడమే. ఒక్కొక్క విధమైన కృషికి ఒకచీటీ అతికించి, కులంగా తయారుచేసి, ఎదగనివ్వకుండా ఆపివేసి, కొల్లగొట్టడానికి అనువుగా మార్చుకోవడమే.

**శతాబ్దాల క్రిందటి ఉద్యమాలు :**

వర్ణవ్యవస్థకు దారుణంగా బలైపోయినవారు 'శరీరకష్టం స్ఫురింపచేసే వెనుగబడిన వర్గాలవారే' పవిత్రమైన వైదిక ధర్మాన్ని కూడా నవ్వులపాలు చేసిన వ్యవస్థ ఈ కులవ్యవస్థ, ఇందులోని భావహెచ్చుతగ్గుల వం.

క్రీస్తుపూర్వయుగంలోనే ఈవర్ణవ్యవస్థపైతిరవిప్లవోద్యమాలు రేగాయి. వాటిల్లో ప్రముఖమైంది చార్వాకుడు లేవదీసినది.

చార్వాకుడు బ్రాహ్మణుడని మహాభారతం పేర్కొంటున్నప్పటికీ ఆయన బానిసలందరిని తీసికొనివెళ్ళి, ఆనాటికి బానిసల ఉద్యమం లేవదీసి శరీరకష్టం చేయడానికే ప్రత్యేకంగా కొన్ని జాతులను దేవుడు సృష్టించాడనే మాటను ఖండిస్తూ, అసలు దేవుడే లేడని వాదించాడని కొందరు పేర్కొంటున్నారు.

చార్వక తర్వాత వచ్చిన బౌద్ధంకూడా వర్ణరాహిత్యానికి కష్టపడుతూ అన్నింటికీ మూలశక్తిగా దుఃఖాన్ని వర్ణించి విశ్లేషించింది. కృషిని దోపిడీ చేయడం కంటే, నిత్యదోపిడికి గురైపోయి కృంగిపోవడం కంటే మించిన దుఃఖంలేదు, బుద్ధుని ప్రభోధానికి ఆకర్షితులై వాళ్ళల్లో ఎక్కువశాతం దోపిడీ వ్యవస్థకు గురైనవాళ్ళే.

అయితే అవి ప్రధానంగా తత్వమార్గాలైపోయి వాటి వెనకాలవున్న కష్టజీవుల ఆస్తి తెరమరుగున పడిపోయింది.

తెలుగు దేశంలోకూడా ఇలాంటి ఉద్యమాలు నడిచాయి. వీరశైవం, వీవైష్ణవం ప్రముఖంగా అగ్రవర్ణాలను ఉద్దేశించిన ఉద్యమాలే పల్నాటి బ్రహ్మనాయుని 'చాపకూడు' పద్ధతి హీన అగ్రభావాలను సామాజికంగా తొలగించడానికి ఉద్దేశించిన ప్రయోగమే.

కాని నిత్యమూ స్వార్థ శక్తులదేపై చేయి అయింది. హీన, ఉన్నత భావాలు సమసిపోలేదు.

వర్ణవ్యవస్థలోబాధపడేవాళ్ళేవరైనావుంటేవారందరూఈదేశంలోని వెనుకబడినతరగతుల వారేఅవుతారు. భూమిమీదో, చదువు మీదో, వర్తకం మీదో పెత్తనం సాధించుకొన్న వాళ్ళకు వర్ణవ్యవస్థ లొంగివర్తించింది. ఏ పెత్తనంలేక సమాజానికి పనికివచ్చే రకరకాల వృత్తులను ఆశ్రయించుకొన్న వాళ్ళకు తలనెత్తి వర్ణవ్యవస్థ స్వారీ చేసింది. సామాజికంగా సాంస్కృతికంగా ఆర్థికంగా అన్నింటా వారిని దుర్బలులను చేసివదలి పెట్టింది.

**పారిశ్రామిక విప్లవం తర్వాత :**

పారిశ్రామిక విప్లవం గతశతాబ్దంలో ఆవిర్భవించి, ప్రపంచమంతటా కొత్త నాగరికతను ప్రవేశపెట్టింది.

ఈ శతాబ్దం ఆరంభంలో భారతదేశంలో పాదుచేసికొని కొత్తరకం సంధివ్యవస్థను సృష్టించింది.

పారిశ్రామిక విప్లవం మూలంగా మన దేశంలో సామాజికంగా ఆర్థికంగా ముందుబడిన వర్గాల వారందరూ కొత్త చైతన్యాన్ని పుంజుకొంటే, వెనుకబడిన వర్గాల వారందరూ దరిద్ర నారాయణులయ్యారు.

వెనుకబడిన వర్గాలలో అత్యధిక శాతం ఏదో ఒక సామాజిక, సాంస్కృతిక వృత్తిని చేబట్టి బ్రతికేవాళ్ళే. చేతి కష్టం మీద జీవించే వాళ్ళే అయితే యంత్రాలు వచ్చి, వీరి జీవనాన్ని కాస్త కొల్లగొట్టాయి. యంత్రాలలో తయారయ్యే వస్తువుల మీద ప్రీతితో, వీరి చేతి తయారీల మీద ప్రజలు ఆధారపడడం తగ్గించారు. ఫలితంగా అత్యధికులు నిరుద్యోగులయ్యారు. సామాజికమైన తక్కువ స్థితికి తోడు, ఆర్థికమైన తక్కువస్థితి కూడా జతపడి, వీరినందరినీ దుర్బలులను చేసివేసింది. కొంతకు కొంత భూవసతి మీద ఆధారపడినవారు కాస్తనిలబడగలిగినారు కాని, మిగిలిన వారు పూర్తిగా నిక్కష్టస్థితిలోపడినారు. ఈ వర్గాల ప్రజలలో ఎంత మందికి భూవసతి వుంటుంది ? రేక్కాడితే డొక్కాడని ప్రజలకు, రెక్కల కష్టం పట్టించుకొనేవారే కరవయ్యారు. ఇది పోషకవర్గానికి తృప్తికలిగించినా, శ్రామిక వర్గానికి చిత్రహింసాప్రాయంగా తయారైంది.

**చరిత్ర చేసిన లోటుకు :**

వెనుకబడిన వర్గాలని నేడు పిలువబడే భిన్న జాతుల వారికి కలిగినకష్టం, నష్టం ఒకపూటతో ఒక మాటతోతీరేవి కావు. చరిత్ర సృష్టించిన లోటుఇది. దీన్ని భర్తీచేయడానికి కేవలం వనరులు మాత్రం చాలవు. ఎంతో సహృదయత, విశ్వసౌభాత్ర భావన కావాలి.

ఈ శతాబ్దం ఆరంభం నుండి, వీళ్ళ కష్టసుఖాలను గుర్తించడానికి ప్రయత్నాలు జరిగాయి. భిన్న కులాల వారిని వర్గీకరించి, వారి సమస్యలను పరిశీలించడానికి ప్రయత్నాలు జరిగాయి.

1901 లో భారత సెన్సస్ కమీషనర్ గా వుండిన రైస్లీ గారు, ఆనాటి సామాజిక ప్రతిపత్తిరీబట్టి, భిన్నకులాల వారిని వర్గీకరించడానికి తొలిసారిగా ప్రయత్నం చేశారు. తర్వాత సెన్సస్ పరిశీలనలో ఈ వర్గీకరణ విధానం ప్రత్యేక స్థాయిని పొందింది. కొంతకాలం "నిమ్న కూ తులు" గా, 'అస్పృశ్య జాతులుగా' దళితవర్గాలుగా పేరుపొందిన వారందరూ, చివరకు బలహీనవర్గాలనీ, వెనుకబడిన తరగతులవారనీ ఒక స్థూల పరిగణనలోనికి వచ్చారు. ఈపరిగణన ప్రాథమికంగా సామాజిక ప్రతిపత్తిని ఆధారంగా తీసుకొని మొదలైనదే. సామాజికం అన్నదాంట్లోనే ఆర్థిక విషయం కూడా అంతర్లీనమైవుంది. ప్రతి సమాజ నిర్మాణానికీ మూలస్తంభం ఆర్థికతే. కనుక ఈ రోజు వీళ్ళను మళ్ళీ సామాజికంగానూ, విద్యాపరంగానూ వెనుకబడిన తరగతులవారనీ ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారనీ రెండు విధాలుగా విడదీయడం సమంజసంకాదేమో!

పూర్వం మద్రాసు రాష్ట్రం, మైసూరు రాష్ట్రం కూడా వెనుకబడిన తరగతుల వారిని ప్రత్యేకంగా గుర్తించి, ప్రతి ఏడాదీ ఈ తరగతులవారి పట్టికలను ప్రకటించేది. బ్రిటిషు పాలకులు, భారత సంస్థానాధీశులు వివిధ రీతుల్లో ప్రత్యేక రాయితీలను ఈ తరగతుల వారి కోసం కేటాయించారు. అయితే అవి బహుళ జనోపయోగమయ్యేటంత విస్తృత పరిధిలో ఉండేవి కావు.

## నవభారతంలో :

అలా విస్తృత పరిధిలో, ఈ వర్గాలవారందరి సంక్షేమం కోసం సంతృప్తికరమైన ప్రయత్నాలు స్వాతంత్ర్యం వచ్చాకనే ఆరంభమయ్యాయి.

ప్రజలందరికీ సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం కలిగించాలన్నది నవభారత రాజ్యాంగం తొలిపలుకు. కులమత శక్తులు తాండవించిన భారతంలో, కుల, మత, లింగ, స్థాన జన్మ ప్రత్యయాల వివక్షతో ఎలాటి అన్యాయం జరగదనిహామీ ఇస్తూ, భారత రాజ్యాంగం 15 (4) లో సామాజికంగా, విద్యాపరంగా వెనుకబడిన తరగతుల వారికోసం లేదా షెడ్యూల్డ్ జాతులు, తెగలవారి కోసం ప్రత్యేక సదుపాయాలు కలిగించడంలో ఎలాటి అడ్డంకి ఉండదని ఉద్ఘాటించబడింది.

ఉద్యోగ విషయాలలోనూ కులమత స్వార్థశక్తుల ప్రమేయం లేకుండా అందరికీ సమాన న్యాయం దక్కుతుందని భారత రాజ్యాంగం అభివర్ణించింది. 16 (4) లో ఉద్యోగిక రంగంలో సరైన ప్రాతినిధ్యం లేదని భావించినప్పుడు, వెనుకబడిన తరగతుల వారి కోసం ఉద్యోగాల విషయంగా రిజర్వేషన్లు ప్రకటించడానికి ఎలాటి ప్రతిబంధన వుండబోదని పునరుద్ఘాటించింది.

ఈ ఉద్ఘాటనలు ప్రాథమిక హక్కులుగా రాజ్యాంగం పేర్కొనడాన్ని ప్రత్యేకంగా గమనించాలి. అంటే వెనుకబడిన తరగతుల వారికి రిజర్వేషను వుండడం, ప్రత్యేకమైన సదుపాయాలను పొందడం భారత రాజ్యాంగ రీత్యా ప్రాథమికంగా లభించినవరం. నాటి అమలులో మాత్రం జాప్యం జరిగింది. ఈ వెనుకబడిన తరగతుల క్రిందకు ఏ ఏ కులాలు వస్తాయి ? అన్న విషయాన్ని పరిశీలించి జాబితా తయారు చేయడం ఒక బృహద్ఘట్టం. కాకా కలేల్కర్ గారి కమిషన్ ఏర్పడి, ఇలాటి పరిశీలన జరిపి నివేదికను సమర్పించిందికూడాను. కాని కేంద్రప్రభుత్వం అంగీకరించలేదు. ఇంకో క్రొత్త కమిషన్ ఇటీవల వచ్చింది కూడాను.

## రాష్ట్ర ప్రయత్నాలు

వెనుకబడిన కులాలూ, షెడ్యూల్డ్ కులాలు, తెగలు మొదలైన బలహీన వర్గాల వైజ్ఞానిక, ఆర్థిక అవసరాలను తీర్చడానికి సాంఘిక దురాక్రమణల నుండి వారిని పరిరక్షించడానికి ప్రత్యేక జాగ్రత్తతో కార్యక్రమాలను నిర్వర్తించడం ప్రభుత్వ నిర్దేశక సూత్రంగా రాజ్యాంగం 46వ అనుచ్ఛేదంలో పేర్కొంది. అందుకు అనుగుణంగానే రాష్ట్రస్థాయిలో వెనుకబడిన తరగతుల సంక్షేమం నిమిత్తం భిన్న కార్యక్రమాల అమలుకు ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రయత్నాలు ఒక పటిష్ట రూపంలోకి రావాలంటే మున్ముందుగా అధికారికమైనటువంటి ఒక వెనుకబడిన తరగతుల జాబితా తయారు కావలసి వుంది. భారత రాజ్యాంగం 341 అనుచ్ఛేదం ఈ జాబితా నిర్మాణ రీతిని వివరించింది. ఇందుకోసం అనంతరామన్ కమిషన్ ఏర్పాటై, అధికారిక జాబితాను తయారు చేసింది. సంక్షేమ నిమిత్తం కొన్ని చక్కని సూచనలు చేసింది. ఫలితంగా ఉద్యోగ, విద్యా రంగాలలో రిజర్వేషన్లు, వెనుకబడిన తరగతుల సంక్షేమం నిమిత్తము ప్రత్యేక డైరక్టరేటు, ఆర్థిక సహాకారమందించడానికి ఒక క్రొత్త కార్పొరేషన్ అమలులోకి వచ్చాయి. వెనుకబడిన తరగతుల సంక్షేమ నిమిత్తం ఎన్నో కార్యక్రమాలు రూపొందింపబడ్డాయి. ఈ తరగతులకు చెందిన విద్యార్థుల కోసం హాస్టళ్లు వెలిశాయి. ఉపకార వేతనాలు, జీతం మినహాయింపులు, భోజన వసతి సదుపాయాలు ముమ్మరంగా లభిం

చాయి. వృత్తి విద్యకు చెందిన కళాశాలల్లో కూడా రిజర్వేషన్లు వచ్చాయి. అదనపు బోధన సౌకర్యాలు ఏర్పాటయ్యాయి. ఆశ్రమ పాఠశాలలు ప్రత్యేకించి స్థాపింపబడ్డాయి. ప్రత్యేక ఉపాధి కల్పన శిక్షణ శిబిరాలు పని చేస్తున్నాయి. ఈ స్వల్ప వ్యవధిలోనే సంక్షేమ కార్యక్రమాలు విరివిగా రూపు గొంటున్నాయి.

కార్యక్రమాలయితే రూపుగొంటున్నాయి కాని, ఆచరణలో అవి ఎలాగున్నాయి ? నిజంగా ఆశించిన సత్ఫలితాలు వస్తున్నాయా ? లేక ముసుగులో అన్యాయాలు ముప్పిరి గొంటున్నాయా?... ఫర్మానా జారీ కావడం ఒక ఎత్తు. ఆచరణలో న్యాయం జరగడం ఒక ఎత్తు. ఈ రెండవ విషయాన్ని సాకల్యంగా పరిశీలించడానికే 75లో రాష్ట్ర విధాన పరిషత్తు ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీకి అధ్యక్షునిగా అధ్యక్ష్యం వహించే బాధ్యత నాకు లభించడం, తద్వారా ఎన్నో విషయాలను పరిశీలించి, లోటుపాట్లను నివేదించి, వెనుకబడిన తరగతుల సేవ చేసే భాగ్యం కలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈ కమిటీ రెండు మార్లు నివేదికలను వెలువరించింది.

## సంక్షేమ కార్యక్రమాలు – ఒక పరిశీలన

వెనుకబడిన తరగతుల వారి కోసం జరుగుతున్న సంక్షేమ కార్యక్రమాలను పరిశీలిస్తుంటే, ఒక విషయం అవగతమౌతుంది. విద్యారంగంలో, విద్యార్థులుగా వున్నవారికి ఉద్దేశించినంత విస్తృతంగానే, మిగిలిన రంగాల్లోకూడా సంక్షేమ కార్యక్రమాలు విరివిగా రూపొందాలి. వెనుకబడిన తరగతుల వారిలో, అధిక శాతం, మునుపే పేర్కొన్నట్లు కళాశీలురే. బట్ట నేయడం ఒక కళ అయితే, అల్లడం కూడా ఒక కళే. కృషిలో నైపుణ్యం, ప్రతిభ కలిస్తే కళ అవుతుందని మునుపే పేర్కొన్నాను. ఈ తరగతులకు చెందిన కొన్ని కులాల వారు పారంపర్యంగా కొన్ని కళలను కూడా పోషిస్తున్నారు. వాటికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. సాంస్కృతిక రంగంలో కొన్ని అంశాలకు సాంప్రదాయికంగా వీరే పట్టుగొమ్మలు. ఆధునిక విద్య వ్యాపించి, సాంప్రదాయికమైన వారి పరిజ్ఞానం, కళా నైపుణ్యం అంతరించి పోకముందే వాటిని కూడా కాపాడి, పెంచి, పోషించాల్సిన బాధ్యత మనకుంది. జానపద కళలుగా మనం పేర్కొంటున్న అనేక కళలు, ఈ వర్గాల ప్రజల్లోనే వున్నాయి. వారి మూలంగానే బ్రతుకుతున్నాయి. వారి బ్రతుకులకే ఆధారంగా వున్నాయి. వారు ఆధునిక చైతన్యాన్ని రంగరించుకొని, అన్యవృత్తుల్ని ఆశ్రయించినప్పుడే, ఈ సాంప్రదాయికమైన పరిజ్ఞానం కూడా అంతరించి ప్రమాదం పొంచి వున్నది. సాహిత్యానికి, మౌలిక విద్యకు వెనుకబడిన వర్గాలకు చెందిన ప్రజలు సజీవనిధులు. ఈ విషయంగా ఎంతో ప్రత్యేకమైన పరిశోధన, పరిశీలన, పరిరక్షణ కార్యక్రమాలు అమలులోకి రావల్సి వుంది. సాంస్కృతిక రంగంలో అలాంటి కార్యక్రమాలు ఇంకా ఏవీ అమలులోకి రాలేదని చెప్పాలి. గిరిజన సంక్షేమ కార్యక్రమాలకు సంబంధించి, ఒక ప్రత్యేకమైన పరిశోధనా సంస్థ ఎలా వెలసిందో, సామాజికంగా, సాంస్కృతికంగా చేపట్టాల్సిన కార్యక్రమాలకు సంబంధించి కూడా, వెనుకబడిన తరగతుల వారికోసం ఒక ప్రత్యేక పరిశోధనా సంస్థ నెలకొనాల్సి వుంది. అలాగే ఈ వర్గ ప్రజలలో అమాయకత్వం ఫలంగా మూఢనమ్మకాల ఫలంగా వ్యాపించి వున్న కొన్ని దురాచారాలను రూపుమాపడానికి కూడా ప్రచార కార్యక్రమాలు ఆశించిన ప్రమాణాల్లో రాలేదు. ఈ ప్రచార కార్యక్రమాలు కూడా ప్రత్యేకమైన అవగాహనతో జరగాల్సిన అవసరం వుంది. అలాగే ఆర్థిక సహకారానికి సంబంధించి కూడా పరిధిని విస్తృత పరచాల్సిన అవసరం వుంది. అలాగే వృత్తి విద్యల వారికి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని పుష్కలంగా అందుబాటులోకి తేవాల్సిన అవసరం ఎంతో వుంది.

ఒక్క విద్యారంగం, ఋణ సహకార రంగమే కాదు– సామాజిక, సాంస్కృతిక, సాంకేతిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నిటిలోనూ లభించే అభివృద్ధే – సర్వతోముఖాభివృద్ధి అవుతుంది. అలాంటి సర్వతోముఖాభివృద్ధికి ఇంకా సంక్షేమ కార్యక్రమాల పరిధిని విస్తృత పరచాల్సిన అవసరం వుండనే వుంది. లేకుంటే కేవలం పాక్షిక అభివృద్ధినే చూడగలము.

## రిజర్వేషన్లు – పరిశీలన

రిజర్వేషన్లకు సంబంధించి 1970–1980 వరకు పదేళ్ళ పాటు అమలుజరపడానికి ప్రభుత్వ ఉత్తర్వు మంజూరయింది. ఉత్తర్వు 1970 లో మంజూరు అయినా, బాలారిష్టాలను దాటుకొని, సుప్రీంకోర్టు తీర్పులను విని వాస్తవంలో అమలులోకి వచ్చేసరికి 1972 కూడ దాటివచ్చింది. అంటే రెండేళ్ళపాటు అదనపు లోటు ఏర్పడిందన్నమాట ! శతాబ్దాల చరిత్ర సృష్టించిన లోటును భర్తీ చేయడానికి పదేళ్ళ అదనపు సౌకర్యం సరిపోతుందా ? బడుగు వర్గాల వారందరూ సమానత సాధించేటంత వరకూ పొడిగించడం అవసరమా ?

వెనుకబడిన తరగతులకు దేశమంతటా, భిన్న రాష్ట్రాలలో రిజర్వేషన్లు అమలులోకి వచ్చాయి. మన రాష్ట్రప్రభుత్వం ఒకశాతం రిజర్వేషన్లను ప్రకటించి, తన ఔదార్యాన్ని నిరూపించు కొంది. అయినా అన్ని రాష్ట్రాలలోనూ ఈ రిజర్వేషన్ల శాతం ఒకే క్రమంలో లేదు. ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క తీరులో వుంది.

భిన్న రాష్ట్రాలలో భిన్న స్థాయిలలో వుండడానికి కారణం ఏమిటి ? దేశమంతటా ఒకేతీరు నవలంభిస్తే సవ్యంగా వుండదా ? ఈ విషయాన్ని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి ఆలోచించవలసిన అవసరం వుంది.

వివిధ రాష్ట్రాలలో అమలుజరుగుతున్న ఈ రిజర్వేషన్లకు మూలభూతమైన ప్రాతిపదిక ఏమిటి ? ఏ సూత్రంమీద ఆధారపడి ఈ రిజర్వేషన్ల శాతాన్ని కేటాయిస్తున్నారు ? ఈ ప్రశ్నను గురించి చాలామంది ప్రజలు సునిశితంగా చర్చిస్తున్నారు - ఆలోచిస్తున్నారు. అయినా సంతృప్తికరమైన, సర్వజన ఆమోదకరమైన సూత్రం స్పష్టంగా తేలడంలేదు.

మనది ప్రజాస్వామ్యదేశం ప్రజాస్వామ్యంలో ముఖ్యవిధాన నిర్ణయాలకు ప్రాతిపదికగా జనసంఖ్య నిలుస్తున్నది. చివరకు ఒక పక్షం అధికారంలోకి రావడానికి, ప్రభుత్వం ఏర్పడడానికి కూడా జనసంఖ్య ముఖ్య ప్రాతిపదికగా నిలుస్తోంది.

కాబట్టే వెనుకబడిన తరగతులవారికోసం కేటాయిస్తున్న రిజర్వేషన్లకు మూలసూత్రంగా, ప్రాతిపదికగా, ఆ వర్గాల జనసంఖ్యను తీసికోవాలని చాలామంది వెనుకబడిన తరగతుల ప్రతినిధులు పేర్కొంటున్నారు. మన దేశంలో బడ్జెట్ కేటాయింపులకు కాని, ప్రభుత్వ నిర్మాణానికి కాని, ఎలక్షన్ల విషయంలో కాని, ప్రాంతీయ విషయాల్లో కానీ సర్వత్రా సమస్త నిర్ణాయక విధులకూ జనసంఖ్యనే ప్రాతిపదికగా తీసికొంటున్నారు కాబట్టి, దీనికిమాత్రం ఎందుకు దాన్నే ప్రాతిపదికగా తీసికోకూడదని ప్రశ్నిస్తున్నారు ? "లోటును పూడ్చడానికి అదనపు సౌకర్యాలు అవసరమై వున్నప్పటికీ, అదనంగా ఏమీ కోరకుండా, ఇప్పుడున్న జనాభానుబట్టి అయినా ఇవ్వండని కోరుతున్నాం" అంటూ నిలదీస్తున్నారు, అన్నింటికంటె అర్థవంతమైనదీ, ఆమోదయోగ్యమైనదీ, ప్రభావవంతమైందీ అదొక్కటే అంటూ అభిప్రాయాన్ని ప్రకటిస్తున్నారు.

ఈ అభిప్రాయాలను సాకల్యంగా సదవగాహనతో పరిశీలించాల్సిన అవసరం వుంది.

ముగింపుగా ....

ముగింపుగా ముఖ్యమైన అవసరాలెన్నో ఇలాంటివి మిగిలాయి. వీటినన్నింటినీ మా ప్రభుత్వం సహృదయంతో పరిశీలిస్తుందని మాత్రం మనవిచేస్తున్నాను.

మన ముఖ్యమంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారు వెనుకబడిన తరగతుల వారందరికీ గొప్ప మిత్రుడు, హితుడు, గురుడు, మార్గదర్శి. ఆ మాటకు మొట్టమొదటిసారిగా జరుగుతున్న ఈ చరిత్రాత్మక సభలే నిదర్శనం.

పంచాయితీ ఎన్నికలలో కూడా కొంత శాతం హరిజనులకు కేటాయింపబడాలన్న సాహసపూర్వకమైన నిర్ణయం బడుగు వర్గాలపట్ల మరికొన్ని సహృదయతకు చక్కటి గుర్తు. వారి నాయకత్వంలోనే తరతరాలనుంచి వెనుకబడిన తరగతులవారిని సామాజికంగా, సాంస్కృతికంగా, సాంకేతికంగా, ఆర్థికంగా, రాజకీయంగా పట్టి పీడిస్తున్న అనేక సమస్యలకు పరిష్కారం లభ్యమౌతుందనీ, పైన పేర్కొన్న అనేక అవసరాలకు ఆత్మీయతతో పరిశీలన లభ్యమౌతుందని, వెనుకబడిన తరగతులు నిజంగా ముందడుగువేసే శుభక్షణం ఆసన్నమౌతుందనీ మనసారా విశ్వసిస్తున్నాను.

---

పశుపోషణ పథకాల ద్వారా

# వెనుకబడిన వర్గాల వారి సంక్షేమం

బి. రాందేవ్*

బలహీన వర్గాలు మరియు వెనుకబడిన వర్గాల ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధి కృషిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అగ్రగామి అని చెప్పవచ్చు. వారి ఆర్థిక, సాంఘిక సంక్షేమానికి అనేక అభివృద్ధి కార్యక్రమాలు రూపొందించి జయప్రదంగా అమలు చేయడం జరుగుతుంది. ఈనాడు మన రాష్ట్రంలో 93 కులాల వారికి సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారిగా గుర్తింపు లభించింది. మన రాష్ట్రంలోని జనాభాలో 40% వరకు వెనుకబడిన తరగతుల వారున్నారు. వీరి ఆర్థిక పరిస్థితి ఎంతో బలహీనంగా ఉంది. వీరి ఆర్థిక పరిస్థితి త్వరిత గతిని అభివృద్ధి పరచడానికి, అనేక రంగాలలో పెద్ద ఎత్తున కృషి జరుగుతుంది. వ్యవసాయం, పాడిపరిశ్రమ, కోళ్ల పెంపకం, గొర్రెల పెంపకము, నేతపని, చేపల పెంపకము, కుటీర పరిశ్రమల వంటి కార్యక్రమాల ద్వారా వీరి ఆర్థిక పరిస్థితి త్వరిత గతిన మెరుగు పరచవచ్చు, బలహీనవర్గాలు, మరియు వెనుకబడిన వర్గాల అభివృద్ధి కృషిలో పశు సంవర్ధకశాఖ ప్రముఖ పాత్ర నిర్వహించుచున్నది.

పశుగణాభివృద్ధి రంగం కార్యక్రమాలన్నీ పాలు, గుడ్లు మాంసం వంటి బలవర్ధక పోషక పదార్థాల అధికోత్పత్తికి కృషి చేస్తూ, సంఘంలోని బలహీన వర్గాలు, వెనుకబడిన తరగతులు సన్నకారు, చిన్నతరహా రైతులు, వ్యవసాయ కూలీల ఆర్థిక పరిస్థితి మెరుగు పరిచే విధంగా రూపొందించబడి అందుకనుగుణ్యంగా నడుపబడుచున్నవి. పశుపోషణ ఉత్పత్తి కార్యక్రమాలు, గ్రామీణ ఆర్థిక పురోభివృద్ధికి ఎంతగానో దోహదం చేస్తున్నవి. బలహీన వర్గాల వారికి వెనుకబడిన తరగతుల వారికి పశూత్పత్తి కార్యక్రమాలు, గ్రామీణ ఆర్థిక పురోభివృద్ధికి అనావృష్టి ప్రాంతాభివృద్ధి కార్యక్రమాలు సమీకృత గ్రామీణాభివృద్ధి పథకములు, బ్యాంకుల ద్వారా అమలుచేయు కార్యక్రమాలకు జోడించి అనేక పథకాలు అమలులో న్నున్నవి. యిలాంటి అనేక పథకాలు ద్వారా పశుపోషణ రంగం బడుగు జాతి ప్రజల ఉన్నతికి వారికి ఎక్కువ ఆదాయపు వనరులు కల్పించుటకు ఎంతగానో తోడ్పడుచున్నవి. పశుగణాభివృద్ధితో పాటు బలహీనవర్గాలు, మరియు వెనుకబడిన వర్గాల అభ్యున్నతికి ప్రత్యేకంగా అమలు జరిగే కార్యక్రమాల వివరాల గురించి క్లుప్తంగా తెలుసుకొందాం.

**బలహీనవర్గాలవారికి పశుపోషణ పథకాలు:**

వెనుకబడిన వర్గాలవారి ఆర్థిక పరిస్థితి, కోళ్ల పెంపకము పాడిపశువుల పెంపకము, గొర్రెల పెంపకము పందుల పెంపకము వంటి ఉపవృత్తుల ద్వారా మెరుగు పరచవచ్చునన్న ఆశయంతో ప్రత్యేక పశుపోషణ కార్యక్రమాలు అమలు చేయబడుచున్నవి. మనరాష్ట్రంలోని 18 జిల్లాలలో 19 పశుపోషణా పథకాలు అమలు చేయడం జరుగుతుంది. యిందులో 5 పథకాలు సంకర జాతి దూడల పెంపకం, 6 పథకాలు గొర్రెల పెంపకము, 5 కోళ్ల పెంపకము, 3 పందుల పెంపకము పథకాలు అమలు జరుగుచున్నవి. ఈ పథకాల క్రింద 100 కోళ్లుగాని, 20 ఆడగొర్రెలు ఒక పొట్టేలుగాని, 5 పంది పిల్లలుగాని, సన్నకారు రైతులకు వ్యవసాయకూలీలకు 33 1/3%, చిన్నతరహా రైతులకు 25% సబ్సిడీ మీద సరఫరా చేయబడుతున్నవి. వీటికి కావలసిన మిగతా మొత్తాన్ని బ్యాంకుల ద్వారా ఋణసౌకర్యం కల్పించబడుతుంది. ఈ ఉత్పత్తుల ద్వారా నెలసరి 100 నుండి 150 రూపాయల వరకు అదనపు ఆదాయం లభిస్తుంది. ఆవుదూడల పెంపకం కార్యక్రమం క్రింద నాలుగు మాసాల వయస్సుగల సంకర జాతి దూడలు చేర్చుకొనబడుతాయి. వీటిని 28 మాసాల వయస్సువరకు అంటే మొదటి ఈత ఈనేంతవరకు పోషణకు కావలసిన మేతను సబ్సిడీ రూపంలో సరఫరా చేయబడుతుంది. 50% చిన్నతరహా రైతులకు, 66⅔% సన్నకారు రైతులకు, వ్యవసాయ కూలీలకు సబ్సిడీ లభిస్తుంది. చిన్న తరహా రైతుల అభివృద్ధి పథకం క్రింద బలహీన వర్గాలవారికి వెనుకబడిన జాతులవారికి సబ్సిడీమీద పాడిపశువుల పంపిణీ కూడ జరుగుతున్నది.

ఈ ప్రత్యేక కార్యక్రమాలు మన రాష్ట్రంలో 1976-77 సం. ము నుండి అమలులో నున్నవి. ఈ కార్యక్రమాల క్రింద లబ్ధి పొందినవారిలో 1976-77 సం. ములో 22%, 1977-78 సం. ములో 54%, 1978-79 సం. ములో 46% వరకు వెనుక బడిన వర్గాల వారికే లభించినది. ఈ వర్గాల వారు ఎంతో మంది పశుపోషణ ఉపవృత్తులను చేపట్టి తమ జీవనోపాధి గడుపుకొంటున్నారు. బలహీన వర్గాల వారి సంక్షేమానికై ఉద్దే

* పశుపోషణ, పాడిపరిశ్రమ శాఖల మంత్రి, ఆం.ప్ర.

*Raj Bhavan,*
*Gandhinagar*-382020,
*via., Ahmedabad,*
6*th April,* 1979.



I am happy to learn that the Andhra Pradesh State Backward Classes Conference will be held on April 28-29, 1979 to highlight the welfare measures undertaken by the State Government for the benefit of Backward Classes.

I extend my best wishes for the success of the Conference.

SHARADA MUKERJEE,
*Governor of Gujarat.*

# సమాజానికొక సవాలు

కె. వి. నరసప్ప*

మన దేశం ఎదుర్కొంటున్న సాంఘిక సమస్యలు ఈనాటివి కావు. అవి అనాదినుంచీ వస్తున్నాయి. అందుకేనేమో, మన జాతిపిత బాపూజీ, తను చేపట్టిన ఉద్యమాలలో తలమునకలవుతున్నప్పటికీ ఆనాటి రాజకీయ సమస్యలకన్నా సాంఘిక సమస్యల మీద ఎక్కువ శ్రద్ధ చూపారు. ముఖ్యంగా మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తరుణంలో అనేక కారణాల వల్లనైతేనేమి, ఈ సమస్యలు వికృత రూపాలను దాల్చాయి. విదేశీపాలన, మనం కన్న కలలకు గొడ్డలిపెట్టు అయింది. సంకుచిత భావాలు ఎల్లెడల ప్రాకాయి. ద్వేషం రాజుకుంది. దీనివల్ల మన సాంఘిక సమస్యలకు ఒక పరిష్కారమంటూ ఏదీ చేకూరలేదు. ఫలితముగా సమాజంలో అట్టడుగున వున్న బలహీనవర్గాలు నానాటికీ దిగజారిపోయారు.

## కొత్త మలుపు:

పరాయిపాలన తొలిగి స్వతంత్రం వచ్చాక సంక్షేమ రాష్ట్రాలు ఏర్పడడంతో ఒక కొత్త మలుపు తిరిగినట్లయింది. వెనుకబడిన తరగతులు, షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సంక్షేమం కోసం కొంగ్రొత్త మార్గాలు కనుగొన్నారు ప్రణాళికలు రచించేటప్పుడు దీనిపై ఎక్కువ శ్రద్ధ చూపారు. సర్వతోముఖాభివృద్ధి జరగాలంటే విద్య అవసరం. అంతేకాదు బ్రతుకు తెరువుకి కూడా ఇది ఉండాలి. గనుక ప్రణాళికా రచయితల దృష్టికి ఇది ఆకట్టుకోవడంవల్ల విద్యకు సంబంధించి పథకాలు క్రొత్త ప్రాముఖ్యతలను సంతరించుకున్నాయి.

## మార్గదర్శక సూత్రాలు:

వెనుకబడిన తరగతుల సంక్షేమానికి సంబంధించి ప్రణాళికా సంఘం ఒకానొక సందర్భంలో నిర్మొహమాటంగా ఇలా చెప్పింది... తరతరాలుగా వస్తున్న సాంఘిక, సాంస్కృతిక బలహీనతలు పరిసరాల ప్రభావంతో వీరి జీవన ప్రమాణాలను కాలరాచాయి. ఈ బలహీనతలను రూపుమాపేందుకు రాజ్యాంగంలోని నిర్దేశిక సూత్రాలననుసరించి శాసనపరమైన, ఆచరణీయమైన చర్యలు తీసుకోవడం జరిగింది. వీరి సాంఘిక, ఆర్థిక, రాజకీయ ఉన్నతికోసం రకరకాల కార్యక్రమాలను కూడా చేపట్టడం జరిగింది. ఇంతటితో సరిపోదు. సమాజములోని ధనిక, పేద ప్రజల మధ్యగల అంతరాన్ని తొలగించాలంటే విస్తృతమైన కృషి అవసరం". మన రాష్ట్రంలో నైతేనేమి, మన దేశంలో నైతేనేమి, బలహీనవర్గాలు ముఖ్యంగా వెనుకబడిన తరగతుల కోసం అభివృద్ధి పథకాలను రూపొందించడంలో పై మార్గదర్శక సూత్రం ఎంతో దోహదం చేసింది.

## వెల్లువికిన ఉత్సాహం:

ప్రణాళికలలో దీనిపట్ల ఉత్సాహం రానురాను ఇనుమడించసాగింది. అయిదో పంచవర్ష ప్రణాళికలో అద్వితీయమైన విశేషం ఒకటి చోటు చేసుకుంది. అదే కనీస అవసరాల కార్యక్రమం. వెనుకబడిన తరగతులవారికి చేయూతనివ్వడానికి ఇది ఉద్దేశించబడింది. విద్యారంగంలో ఉపకార వేతనాలు హాస్టలు వసతి సౌకర్యాలు కలుగచేయడమేగాకుండా, వృత్తిపరమైన విద్యకు ప్రాధాన్యం ఇస్తూ పరికరాలు కూడా ఇస్తున్నారు. అంతేకాకుండా వెంటనే ఉద్యోగావకాశాలు లభించడానికివీలుగా శిక్షణ సౌకర్యాలు కూడా కలుగచేస్తున్నారు. వర్ధమానతరాల వారికి ఇది ఎంతో సహాయకారిగా ఉండగలదు. ఈ చర్యలన్నీ అతిముఖ్యమైనవే. అందులో ఏమాత్రం సందేహం లేదు. అయితే ఈ సమస్యను అవి సమూలంగా పరిష్కరించలేకపోయాయనడం నిస్సందేహం. తమ తమ వృత్తులను ఆధునికీకరణం చేసుకొనే నిమిత్తము ఆర్థిక సహకార కార్యక్రమాలు, ఆర్థిక సహకారం అందించటం ద్వారా, రైతులకు వ్యవసాయ కూలీలకు, వృత్తికారులకు, చేతిపనివారికి తోడ్పడుతున్నాయి.

జాబితాలోని వెనుకబడిన తరగతులవారి కోసం ఒక స్వయంపాలిత సంస్థను ఏర్పరచి తద్వారా సంస్థాపరమైన నిధులను, ఎంత వీలయితే అంత వాడుకోవడం జరుగుతున్నది.

## ప్రోత్సాహకరమైన పరిస్థితి:

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక సంస్థ 1974 లో ఏర్పడిన తర్వాత అది ఆ తరగతుల

* చిన్న తరహా పరిశ్రమల శాఖా మంత్రి

JOTHI VENCATACHELLUM
*Governor of Kerala*

RAJ BHAVAN
Trivendrum

April 20, 1979

I am happy to know that a State Level Conference of Backward Classes is proposed to be held on 28th and 29th April, 1979 by the Government of Andhra Pradesh with a view to highlighting the welfare measures undertaken by the Government of Andhra Pradesh for the benefit of Backward Classes.

I have pleasure to send my best wishes for the success of the Conference.

JOTHI VENCATACHELLUM

ఆంధ్ర ప్రదేశ్‌లో

# చేనేత కళాకారులు

పి. వి. చె

మన రాష్ట్రంలో చేనేత కళాకారుల పురోగతికి, చేనేత పరిశ్రమ అభివృద్ధికీ రాష్ట్ర ప్రభుత్వం గత కొద్ది సంవత్సరాలుగా ఎన్నో గురుతరమైన చర్యలు తీసుకొన్నది. జనాభా ప్రకారంగా, వ్యవసాయ కార్మికుల తరువాత రెండవ స్థానం చేనేత కళాకారులదే, దాదాపు 30 లక్షల మంది తమ జీవన భృతికై ఈ చేనేత పరిశ్రమపైన ఆధారపడి ఉన్నారు. వీరికి సుమారు 5.02 లక్షల మగ్గాలు ఉన్నాయి.

చేనేత పనివారి సహకార సంఘాలు: అనేక మంది చేనేత పనివారిని సహకార సంఘాల పరిధి లోనికి తీసుకు రావడానికి చర్యలు తీసుకోబడ్డాయి. దీని వలన ప్రణాళిక పథకాలు, ప్రణాళికేతర పథకాల క్రింద అందుబాటయ్యే అనేక ప్రయోజనాలు ఈ చేనేత శ్రామికులకు చేకూరడానికి వీలు కలుగుతుంది. ప్రణాళిక పథకాల క్రింద మన రాష్ట్రంలో ఇప్పటి వరకు రూ. 20.57 కోట్ల పైకం చేనేత పరిశ్రమ అభివృద్ధికై వెచ్చించ బడింది. ఇప్పుడు, చేనేత పనివారి సహకార సంఘాల సంఖ్య మొత్తం 1,690కి పెరిగింది, ఈ సంఘాలలో 3.27 లక్షలకు పైబడి సభ్యులు ఉన్నారు. వీరంతా మగ్గాలపై పనిచేస్తున్న వారే. ప్యాకేజి పథకం క్రింద, ఎంపిక చేసిన చేనేత పనివారి సహకార సంఘాలు సమిష్టి మగ్గాల చావడిలో ఫ్యాక్టరీ రకం ఉత్పత్తిని సాధించే రీతిగా వాటికి సాంకేతిక, ఆర్థిక సౌకర్యాలు కలుగ చేయడానికి పథకాలుకూడా ప్రత్యేకంగా రూపొందించడం జరిగింది. ఈ సహకార సంఘాలకు కావలసిన ముడి సామగ్రి కొనుగోలు చేయడానికి, నేత, తత్సంబంధమైన యితర కార్యకలాపాలు కొనసాగించ డానికి వీలుగా, భారత రిజర్వు బ్యాంకు వారి చేనేత పని వారికి ఆర్థిక సహకారం అందజేసే పథకం క్రింద నిర్వహణ మూల ధనం ఏర్పాటు చేయబడింది.

సాంకేతిక, తదితర సదుపాయాలు కూడ, మగ్గం పనికి ముందర, తరువాత ప్రాసెసు పనిలోను, ఉత్పత్తి అభివృద్ధి, చేనేత నైపుణ్యాన్ని మెరుగుపరచడం వంటి వివిధ దశలలో ప్రభుత్వం చేనేత పనివారికి సాంకేతిక సహాయం అందజేస్తున్నది.

అభివృద్ధి పరచిన మగ్గాలపై పని చేయడంలోను, వాట లోను, మారుతున్న వినియోగ దార్ల అభిరుచులకు ఎప్పటికప్పుడు కొంగొత్త డిజైనులు ఉత్పత్తి చేయ ఈ కళాకారులకు శిక్షణ ఇవ్వబడింది. చేనేత సంఘాలు, అమ్మకపు డిపోలు, నగర ఎంపోరియం రాష్ట్ర అమ్మకపు దుకాణాలు నెల కొల్పుకునే నిమిత్త గ్రాంట్లు మంజూరు చేయబడ్డాయి. ఈ సంఘా సామగ్రి, తదితర సాధన సంపత్తి సరఫరా వాటి వద్ద తయారైన ఉత్పత్తులకు సౌకర్యం ఏర్పాటుచేసే నిమిత్తం, ఈ ఏకీకృత చేనేత వ్యవస్థగా రూపొంద డా ప్రభుత్వం సహాయపడింది. మాదిరి చేనేత చేనేత పరిశోధన, అభివృద్ధి కేంద్రాలు, ఆధునిక అద్దకప క్లాథ్ ప్రాసెసింగ్ యూనిట్లు మొదలైనవి నెలకొల్పుక ఈ ప్రాథమిక సంఘాలకు, అపెక్సు సంస్థలకు చేయూత నిచ్చింది. ఈ సంఘాలు, అధునాతన ఫ్యాష గుణంగా మేలురకం వస్త్రం ఉత్పత్తి చేయడానికి తా చేసిన వస్త్రం, చూపరులకు ఇంపు కలిగ పర్యవసానంగా వాటికి గిరాకీ పెరిగే రీతిగా వాటిని చేయడంలోను ఈ ఏర్పాట్లు చాల సహాయపడతాయి. ద్విగుణీకృతం చేయడానికి తేలికగా నిల్వలు పే టటువంటి సమస్యలు పరిష్కరించే ఉద్దేశంతో పండు ర్భాలలో అమ్మకాలపై రిబేటు ఇవ్వడానికి కూడ ప్ర సంఘాలను అనుమతించి, ఆవిధంగా వినిమయదార్లకు రిబేటు పైకాన్ని తిరిగి సమకూరుస్తున్నది.

జనతా వస్త్రం:

చీరలు, ధోవతులు, బెడ్‌షీట్లు, తదితర వినియోగ యితర వస్త్రాల వంటి సాంప్రదాయ గాకుండ, మనరాష్ట్రం సామాన్యమానవుని ప్ర జనతావస్త్రం' అని పిలువబడుతున్న చేనేత కంట్రోలు ప్రవేశపెట్టింది. జనతా వస్త్రాన్ని ప్రాథమిక సంఘా

*జౌళి శాఖా మంత్రి.

PRABHUDAS B. PATWARI,
*Governor of Tamil Nadu.*

*Raj Bhavan,*
*Madras*-600 022
*3rd April,* 1979.

DEAR SHRI VEERAPPA,

I am happy to know that the State Government is holding a State Level Backward Classes Conference on 28th and 29th April to highlight the welfare measures undertaken by the State Government for the benefit of backward classes.

Education and economic problems of the backward classes are the burning problems of today. I am confident that your Government will do its best in this direction.

I wish the Conference great success.

With warm regards.

PRABHUDAS B. PATWARI

# ఈ నవచైతన్యానికి కారణం ప్రగతి పథకాలు

యడ్లపాటి వెంకట్రావు *

మన దేశంలో అనేక చారిత్రిక కారణాలవల్ల, సంకుచిత పరిధులవల్ల ఏర్పడిన సంకుచిత కులాలు, వర్గాలు ప్రజల ఆర్థిక, సాంఘిక రాజకీయ పరిస్థితులలో అనేక వ్యత్యాసాలకు బీజాలునాటాయి. మన చరిత్రను, సాంఘిక వ్యవస్థను తరచి చూస్తే యీ కులాలు, వర్గాలు ఏర్పడడానికి కారణాలు అవగతమవుతాయి. సమాజజీవితం సక్రమంగా కొనసాగుతూ మానవుని అవసరాలు ఎటువంటి లోటుపాట్లు లేకుండా తీరడానికి వీలుగా వృత్తుల విభజన ఏర్పడి సమాజం ముందుకు సాగింది. కాలక్రమాన ఆయా వృత్తులు చేసే కుటుంబాలు వాటిలోనే స్థిరపడిపోయి, అవి వారసత్వంగా పరంపరానుగతంగా కొనసాగుతూ వచ్చాయి. క్రమంగా యీ వృత్తులే 'కులాలు' గా పేర్లు తొడిగాయి. అయితే కాలక్రమాన మూఢ ఆచారాలు, మూఢవిశ్వాసాలు ఏర్పడి, స్వార్థం పెరిగి యీ కులాలే మన ప్రగతికి ప్రతిబంధకాలుగా అడ్డుపడ్డాయి. ఆరోజుల్లో మనవాళ్ళు ఆయా వృత్తులలో ఎంతో నిపుణతను సాధించారు. మన దేశంలో చేతితో తయారైన వస్తువులు విదేశస్థుల మన్ననలను కూడా అందుకున్నాయి. అయితే ప్రపంచంలో యాంత్రిక యుగం ప్రారంభం కావడంతో మనిషి దృక్పథంలో ఆలోచనలో ఎంతో మార్పు వచ్చింది. నాగరికత పెరిగి, నగరాలు ఎదగడంతో కులవృత్తులు కుంటుపడ్డాయి. దానికితోడు అప్పటి పరాయి పాలకులు తమ స్వప్రయోజనాలకోసం తమ దేశాలలో ఉత్పత్తి అయిన వస్తువులను యిక్కడికి దిగుమతి చేసుకోవడంతో ప్రజలలో విదేశవస్తువుల వ్యామోహం ప్రబలిపోయింది. తత్కారణంగా మన దేశంలో కదురు, కవ్వం మూల పడ్డాయి లక్షలాది మందికి జీవనోపాధి కల్పించే అనేక వృత్తులు, వారి నిపుణత అంతరించిపోయాయి. పిల్లపోయినా పురిటివాసన పోనట్టు వృత్తులు కుంటుపడినా కులాలు మాత్రం స్థిరపడిపోయినాయి. అంతేగాక దారిద్ర్యం, అజ్ఞానం రాజ్యం చేయడం ప్రారంభించాయి. తత్ఫలితంగా మనదేశ ప్రజల పరిస్థితి మరింత అధ్వాన్నస్థితికి చేరుకుని ప్రజలు, దేశం బాగా వెనుకబడిపోయాయి. దీనికి యాంత్రిక యుగం కూడా కొంతవరకు కారణమైందని చెప్పవచ్చు. విదేశీపాలకులు తమ స్వార్థప్రయోజనాలనే చూచుకున్నారు. కానీ ప్రజల బాగోగులను ఏమాత్రం పట్టించుకోలేదు. ప్రజల ఆర్థిక స్థితిలో అఘాతం ఏర్పడింది.

ఈ కారణాల వల్ల మన సమాజం ఉన్నతవర్గాలు, బలహీనవర్గాలుగా విభజించబడి, ఉన్నతవర్గాలవారు అన్ని సౌకర్యాలను అనుభవిస్తూ బలహీన వర్గాలవారు మరింత వెనుకబడిపోయారు. జీవనోపాధి సరిగాలేక వారి బ్రతుకులు దినదినగండంగా మారిపోయాయి. స్వాతంత్ర్య సమర కాలంలో మన జాతీయ నాయకులు సమాజంలోని యీ వ్యత్యాసాలను గుర్తించి అన్ని వర్గాల ప్రజలకు అన్ని రంగాలలో సమాన అవకాశాలు కల్పించి, కుల వర్గ భేదం లేకుండా ప్రజలందరూ సమానంగా అభివృద్ధి చెందాలనే నినాదం మనకు యిచ్చారు. విదేశీవస్తువులపై మోజుతగ్గించి, స్వదేశంలో తయారైన వస్తువులకు ప్రోత్సాహం కల్పించే పక్షంలో ప్రజల ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుందని మహాత్మాగాంధీ భావించి ఖాదీ స్వదేశీ ఉద్యమాన్ని ప్రారంభించారు. ఖద్దరు వస్త్రాలనే ధరించాలని ప్రజలకు పిలుపునిచ్చి మహోద్యమాన్ని నిర్వహించారు. ఆయన స్వయంగా రాట్నాన్ని చేపట్టి ఒడకడం ప్రారంభించారు. దానితో ప్రజలలో నూతన చైతన్యం వెల్లివిరిసింది. అప్పటి నుంచే మన దేశంలో చేతివృత్తులు కొంత ప్రాణం పోసుకున్నాయి. స్వాతంత్ర్యం లభించిన తరువాత మన దేశాన్ని సంక్షేమ రాజ్యంగా తీర్చిదిద్ది అందరికీ సమాన అవకాశాలు కల్పించే ప్రధాన లక్ష్యంతో సోషలిస్టు సరళీ సమాజ స్థాపనకు అనువుగా మన రాజ్యాంగాన్ని రూపొందించుకున్నాం. తరతరాల అంతరాలను అంతమొందించుకున్నాం. ప్రజలందరూ సమానులేనని చాటిచెప్పాం. ఈ లక్ష్యానికి అనువుగా మన రాజ్యాంగంలో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడిన తరగతుల ప్రజల నిమిత్తం కొన్ని ప్రత్యేక సదుపాయాలు, రక్షణలు కల్పించారు. స్వాతంత్ర్యం లభించిన తరువాత యీ 30 సంవత్సరాల కాలంలో అనేక రంగాలలో మనం గణనీయమైన అభివృద్ధిని సాధించాం. మన సమాజంలో

---

* వ్యవసాయశాఖ మంత్రి, ఆంధ్ర ప్రదేశ్.

# వెనకబడిన తరగతుల అస్తిత్వం-ఒక పరిశీలన

గౌతు లచ్చన్న*

ఈ విశాల ప్రపంచంలో ఏ దేశాలలోనూ లేని క్రూరమైన కులవ్యవస్థ మన పుణ్యభూమి అయిన భారత దేశంలో దాదాపు వేల సంవత్సరాలుగా పాతుకొనిపోయి మానవుల మధ్య అనేక అరలను శాశ్వత ప్రాతిపదిక పై నిర్మించి, మానవ వికాసానికి నలసిన అవకాశాలను ఈ దేశంలోని బహుజనులకు నిరాకరించిన వ్యవస్థ ప్రాతిపదిక అతి పటిష్టంగా తరతరాలుగా పాతుకొని ఉన్నందువల్లనే వెనకబడిన వర్గాల సమస్య అయితేనేమి, హరిజన-గిరిజన సమస్య అయితేనేమి తీవ్ర రూపంలో ఉన్నాయని నా ఉద్దేశం. వెనకబడిన వర్గాలవారు సంఘటితపడి నందువల్ల ఈ సమస్యల సృష్టి జరగలేదని—వెనుక బడిన వర్గాల సమస్యను సృష్టించీ; పెంచి పోషిస్తున్నది భారతీయ సమాజమూ, ఆ సమాజానికి నాయకత్వం వహిస్తున్న పెద్దలేనని స్పష్టం చేయ దలచుకున్నాను. వెనకబడిన వర్గాలు సంఘటితపడుతున్నది ఈ సమస్యను పరిష్కరించి, దేశంలోని సర్వమానవుల వికాసానికి బాటలు వేయడానికేగాని, సమస్యను మరింత క్లిష్టతరం చేయడానికిగాదు.

వెనుకబడిన వర్గాలవారు కుల సంఘాలుగా ఏర్పడి తమ హక్కుల కోసం పోరాడటం కులతత్వాన్ని పెంచడమేనని కొందరు వాదిస్తున్నారు. వెనుకబడిన వర్గాల వారందరికీ కులవృత్తులున్నాయి. ఈ కులవృత్తులన్నీ దేశపు ఆర్థిక వ్యవస్థలో ప్రధానమైన అంగాలు, అంతేగాని మిగతా కొన్ని కులాల కుల వృత్తులవలె—సోమరితనాన్ని, పరాన్న భుక్త తత్వాన్ని పెంపొందించే కుల వృత్తులను వెనుకబడిన కులాలవారెవారూ అనుసరించడంలేదన్న వాస్తవాన్ని గుర్తించాలి. వీరు కులసంఘాలుగా ఏర్పడి ఆందోళన చేస్తున్నది తమ కులాచారాల పరిరక్షణకు కాక, కేవలం తమ కులవృత్తులను మెరుగుపరచుకోవడానికే పరిమితమనే విషయాన్ని కూడా గుర్తించాలి; ఇక వెనుకబడిన వర్గాలన్నీ ఏక వేదిక మీద సంఘటితపడి సమైక్యం కావడం వల విభిన్న వెనుకబడిన కులాల మధ్య నుండే కులతత్వం-కులవైషమ్యాలూ సడలిపోయి కుల నిర్మూలనకు దారులు సుగమం కావడమే కాని కులతత్వాన్ని పటిష్టంచేయడం కాదని స్పష్టం చేస్తున్నాను. వెనుకబడిన తరగతుల సంఘాలకు కులమే ప్రాతిపదిక అయితే అన్ని కులాలనూ ఒక వేదిక మీదికి తేవడం అసాధ్యమయ్యేది.

వెనుకబడిన తరగతుల ఉద్యమంవల్ల కులతత్వం బలపడుతున్నదని వాదించేవారు ఈ వాదాన్ని కేవలం ఈ ఉద్యమాన్ని అపకీర్తిపాలు చేయడానికి మాత్రమే చేస్తున్నారు. కులాల నిర్మూలన జరగాలని సంకల్పం నిజానికి మాకున్నంత తీవ్రంగా వారికిలేదు. ఒకవేళ ఉంటే హరిజన గిరిజన తదితర వెనుకబడిన కులాల వారితో పెండ్లిండ్లు చేసుకోవడానికి ముందుకు వచ్చే ఉన్నత కులాల మేధావులెవరన్నా ఉన్నారా? అని ప్రశ్నిస్తున్నాను. ఉంటే ముందుకు రమ్మంటున్నాను.

ఇప్పుడు దేశం దృష్టి అంతా బీహారురాష్ట్రంపైనఉన్నది. బీహార్ రాష్ట్రంలో మాజీముఖ్యమంత్రి కర్పూరి ఠాకూర్ గారు ఏమి చర్య తీసుకున్నందువల్ల ఈనాడు దేశంలోని అగ్రకులాల వారందరూ—ఆయన పార్టీలోని వారితో సహా ఆయనపై కత్తులు నూరి చివరకు ఆయనను పదవీచ్యుతుని చేశారో తెలుసు. బీహారు రాష్ట్రి జనాభాలో వెనుకబడిన వర్గాల సంఖ్య 70 శాతంగా ఉన్నది. స్వతంత్రం వచ్చిన 32 ఏండ్ల తదుపరి మొదటిసారిగా ప్రభుత్వోద్యోగాలలో 26 శాతం ఉద్యోగాలను వెనుకబడిన వర్గాలవారికి రిజర్వు చేస్తూ ఠాకూర్ ఉత్తరువు చేశారు. ఈ 26 శాతం పూర్తిగా వెనుకబడిన వర్గాల జాబితాలోవున్న కులాల వారికేనని అనుకుంటున్నారేమో—కాదు. 3 శాతం ఉద్యోగాలను అన్నికులాలకు చెందిన స్త్రీలకు కేటాయించారు. కీ. శే. డాక్టర్ రామమనోహరలోహియా కీ. శే. కాకా కలేల్కర్ గార్లు అందరు స్త్రీలను వెనుక బడినవర్గాలుగా గుర్తించారు. మరి విద్యావంతులై ప్రభుత్వోద్యోగాలకు అర్హులైన స్త్రీలు ఏ కులాల్లో ఎక్కువమంది ఉంటారో అందరికీ తెలుసు. మరో మూడు శాతం ఉద్యోగాలను ముస్లిములలో వెనుకబడిన జాతులవారికి—మోమిస్తు, లద్దాపీలూ, మొదలగువారికి కేటాయించారు. ఇక మిగిలిన 20 శాతంలో కూడా మళ్ళీ వెనుకబడినవర్గాల వారిని రెండు తెగలుగా విభజించారు. మరి వెనుకబడిన వర్గాల జాబితా నొకదాన్ని మామూలుగా వెనుకబడిన వర్గాల జాబితా నొకదాన్ని రూపొందించి మరీ వెనుకబడిన బడిన వారికి 12 శాతం, మామూలుగా వెనుకబడిన వర్గాలవారికి 8 శాతం రిజర్వు చేశారు. రిజర్వేషను సౌకర్యాలను సంపన్నులూ—సమాజంలో పలుకుబడి సంపాదించుకొన్న వెనుకబడిన వర్గాలకు చెందిన కొద్దిమందే

* ప్రతిపక్ష నాయకుడు, ఆంధ్ర ప్రదేశ విధాన సభ



*Raj Bhavan,*
*Lucknow,*
*April* 4, 1979.

Great national sin of ours has been the worst type of degradation that has been perpetuated throughout the centuries in the name of casteism and thus the neglect of a great chunk of our society. If we want to regenerate India, we must work for them. In the process, however, while galvanic shocks of reformatory zeal are necessary to rouse the sleeping sections they should not be destructive and must be in line with our cultural heritage. Destructive measures shall amount, we must bear in mind, to the killing as the 'mosquito and the man' together.

I am glad to know that the A.P. Backward Classes State Conference is being held shortly and I wish its deliberations all success.

G. D. TAPASE
*Governor of Uttar Pradesh.*

వాటితో పాటు, వెనుకబడినతరగతుల ప్రజలకు మిగులు భూముల పంపిణీ మునిసిపాలిటీలు, పంచాయితీరాజ్ సంస్థలలో సీట్ల కేటాయింపు, మొదలైన యితర అనేక చర్యలను కూడ తీసుకుంటున్నారు. వెనుకబడిన తరగతుల సంక్షేమం నిమిత్తం బడ్జెట్ కేటాయింపులను రు. 710 లక్షలకు పెంచుతూ ప్రస్తుత సంవత్సరంలో అదనంగా రు. 230 లక్షలు ప్రస్తుత ప్రభుత్వం కేటాయించింది. అంతేగాక సన్నకారు రైతులకు, లాభసాటిగాని రైతులకు వ్యవసాయాభివృద్ధి నిమిత్తం ప్రభుత్వం అనేక విధాలుగా ఆర్థిక సహాయం అందజేస్తున్నది. వివిధ వృత్తులను చేపట్టిన బలహీనవర్గాల వారికి పెట్టుబడి ధనం, మార్కెటింగు సౌకర్యాలను కల్పిస్తున్నది. స్వయం ఉపాధి పథకాలు అమలు జరపడం ద్వారా వారికి జీవనోపాధి కల్పిస్తున్నారు.

బలహీన వర్గాల సంక్షేమ కృషిలో ప్రభుత్వ ప్రయత్నాలతోపాటు సమాజంలోని యితర ఉన్నత వర్గాల ప్రజలు, స్వచ్ఛంధ సంస్థల సహాయ సహకారాలు ఎంతో అవసరం. ఆర్థిక స్థితిగతులతో నిమిత్తం లేకుండా ప్రజలంతా ఒక్కటే అనే భావం కలగాలి. సాంఘికంగా ఎటువంటి వ్యత్యాసాలు ఉండకూడదు. ఉన్నత వర్గాల వారి దృక్పథం మార్పు రావడం చాలా అవసరం. వారు ప్రజల వెన్నుతట్టి, చేయూతనివ్వాలి. ఈ విప్లవం రావాలి. సామూహిక భోజనాలు వర్ ఎంతగానో తోడ్పడతాయి. అందుకే వర్ణా చేసుకున్న దంపతులకు ప్రభుత్వం ఆర్థిక స ప్రోత్సాహాలను కల్పిస్తున్నది.

ఈనాడు వెనుకబడిన తరగతుల ఉత్సాహం ఉరకలు వేస్తోంది. నూతన చైతన్ ఇతరులతో సమానంగా తాము కూడ ముంద తపన వారిలో మొగ్గతొడిగింది. అయితే స్పృహ యింకా విస్తరించి పల్లెపల్లెకు పాకిపో సహాయాన్ని అందుకోలేని స్థితిలో వున్న బల యిప్పటికీ ఉన్నారు. వారికి మనం చేయూతని లోని ప్రతిఒక్కరూ సమానతను సాధించే విధం మంచి రోజు త్వరలోనే వస్తుందని ఆశిద్దాం.

## వెనుకబడినతనాన్ని వెనక్కు నెట్టుదాం

# వెనకబడిన తరగతుల అస్తిత్వం-ఒక పరిశీలన

గౌతు లచ్చన్న*

ఈ విశాల ప్రపంచంలో ఏదేశాలలోనూ లేని క్రూరమైన కులవ్యవస్థ మన పుణ్యభూమి అయిన భారత దేశంలో దాదాపు వేల సంవత్సరాలుగా పాతుకొనిపోయి మానవుల మధ్య అనేక అరలను శాశ్వత ప్రాతిపదిక పై నిర్మించి, మానవ వికాసానికి నలసిన అవకాశాలను ఈ దేశంలోని బహుజనులకు నిరాకరించిన వ్యవస్థ ప్రాతిపదిక అతి పటిష్టంగా తరతరాలుగా పాతుకొని ఉన్నందువల్లనే వెనకబడిన వర్గాల సమస్య అయితేనేమి, హరిజన-గిరిజన సమస్య అయితేనేమి తీవ్ర రూపంలో ఉన్నాయని నా ఉద్దేశం. వెనకబడిన వర్గాలవారు సంఘటితపడి నందువల్ల ఈ సమస్యల సృష్టి జరుగలేదని—వెనుక బడిన వర్గాల సమస్యను సృష్టించి; పెంచి పోషిస్తున్నది భారతీయ సమాజమూ, ఆ సమాజానికి నాయకత్వం వహిస్తున్న పెద్దలేనని స్పష్టం చేయ దలచుకున్నాను. వెనకబడిన వర్గాలు సంఘటితపడుతున్నది ఈ సమస్యను పరిష్కరించి, దేశంలోని సర్వమానవుల వికాసానికి బాటలు వేయడానికేగాని, సమస్యను మరింత క్లిష్టతరం చేయడానికిగాదు.

వెనుకబడిన వర్గాలవారు కుల సంఘాలుగా ఏర్పడి తమ హక్కుల కోసం పోరాడటం కులతత్వాన్ని పెంచడమేనని కొందరు వాదిస్తున్నారు. వెనుకబడిన వర్గాల వారందరికీ కులవృత్తులున్నాయి. ఈ కులవృత్తులన్నీ దేశపు ఆర్థిక వ్యవస్థలో ప్రధానమైన అంగాలు, అంతేగాని మిగతా కొన్ని కులాల కుల వృత్తులవలె-సోమరితనాన్ని, పరాన్న భుక్త తత్వాన్ని పెంపొందించే కుల వృత్తులను వెనుకబడిన కులాలవారెవారూ అనుసరించడంలేదన్న వాస్తవాన్ని గుర్తించాలి. వీరు కులసంఘాలుగా ఏర్పడి ఆందోళన చేస్తున్నది తమ కులాచారాల పరిరక్షణకు కాక, కేవలం తమ కులవృత్తులను మెరుగుపరచుకోవడానికే పరిమితమనే విషయాన్ని కూడా గుర్తించాలి; ఇక వెనుకబడిన వర్గాలన్నీ ఏక వేదిక మీద సంఘటితపడి సమైక్యం కావడం వల విభిన్న వెనుకబడిన కులాల మధ్య నుండే కులతత్వం-కులవైషమ్యాలూ సడలిపోయి కుల నిర్మూలనకు దారులు సుగమం కావడమే కాని కులతత్వాన్ని పటిష్టంచేయడం కాదని స్పష్టం చేస్తున్నాను. వెనుకబడిన తరగతుల సంఘాలకు కులమే ప్రాతిపదిక అయితే అన్ని కులాలనూ ఒక వేదిక మీదికి తేవడం అసాధ్యమయ్యేది.

వెనుకబడిన తరగతుల ఉద్యమంవల్ల కులతత్వం బలపడుతున్నదని వాదించేవారు ఈ వాదాన్ని కేవలం ఈ ఉద్యమాన్ని అపకీర్తిపాలు చేయడానికి మాత్రమే చేస్తున్నారు. కులాల నిర్మూలన జరగాలని సంకల్పం నిజానికి మాకున్నంత తీవ్రంగా వారికిలేదు. ఒకవేళ ఉంటే హరిజన గిరిజన తదితర వెనుకబడిన కులాల వారితో పెండ్లిండ్లు చేసుకోవడానికి ముందుకు వచ్చే ఉన్నత కులాల మేధావులెవరన్నా ఉన్నారా? అని ప్రశ్నిస్తున్నాను. ఉంటే ముందుకు రమ్మంటున్నాను.

ఇప్పుడు దేశం దృష్టి అంతా బీహారురాష్ట్రంపైనఉన్నది. బీహార్ రాష్ట్రంలో మాజీముఖ్యమంత్రి కర్పూరీ ఠాకూర్ గారు ఏమి చర్య తీసుకున్నందువల్ల ఈనాడు దేశంలోని అగ్రకులాల వారందరూ—ఆయన పార్టీలోని వారితో సహా ఆయనపై కత్తులు నూరి చివరకు ఆయనను పదవిచ్యుతుని చేశారో తెలుసు. బీహారు రాష్ట్ర జనాభాలో వెనుకబడిన వర్గాల సంఖ్య 70 శాతంగా ఉన్నది. స్వతంత్రం వచ్చిన 32 ఏండ్ల తదుపరి మొదటిసారిగా ప్రభుత్వోద్యోగాలలో 26 శాతం ఉద్యోగాలను వెనుకబడిన వర్గాలవారికి రిజర్వు చేస్తూ ఠాకూర్ ఉత్తరువు చేశారు. ఈ 26 శాతం పూర్తిగా వెనుకబడిన వర్గాల జాబితాలోవున్న కులాల వారికేనని అనుకుంటున్నారేమో-కాదు. 3 శాతం ఉద్యోగాలను అన్నికులాలకు చెందిన స్త్రీలకు కేటాయించారు. కీ. శే. డాక్టర్ రామమనోహరలోహియా కీ. శే. కాకా కలేల్కర్ గార్లు అందరు స్త్రీలను వెనుక బడినవర్గాలుగా గుర్తించారు. మరి విద్యావంతులై ప్రభుత్వోద్యోగాలకు అర్హులైన స్త్రీలు ఏ కులాల్లో ఎక్కువమంది ఉంటారో అందరికీ తెలుసు. మరో మూడు శాతం ఉద్యోగాలను ముస్లిములలో వెనుకబడిన జాతులవారికి-మోమిన్సు, లద్దాపీలూ, మొదలగువారికి కేటాయించారు. ఇక మిగిలిన 20 శాతంలో కూడా మళ్ళీ వెనుకబడినవర్గాల వారిని రెండు తెగలుగా విభజించారు. మరి వెనుకబడిన వర్గాల జాబితా నొకదాన్ని మామూలుగా వెనుకబడిన వర్గాల జాబితా నొకదాన్ని రూపొందించి మరీ వెనుకబడిన బడిన వారికి 12 శాతం, మామూలుగా వెనుకబడిన వర్గాలవారికి 8 శాతం రిజర్వు చేశారు. రిజర్వేషను సౌకర్యాలను సంపన్నులూ—సమాజంలో పలుకుబడి సంపాదించుకొన్న వెనుకబడిన వర్గాలకు చెందిన కొద్దిమందే

* ప్రతిపక్ష నాయకుడు, ఆంధ్ర ప్రదేశ విధాన సభ

కాకేయకుండా ఉండటానికి సంవత్సరానికి అరువేల రూపాయలకు పైగా ప్రభుత్వోద్యోగం ద్వారా సంపాదించుకునేవారి పిల్లలకు రిజర్వేషను సౌకర్యం లభించదని స్పష్టం చేశారు. సాహసించి వెనుకబడిన వర్గాలను ఉద్ధరిద్దామనుకుంటే తన అస్తిత్వానికే మోసం వచ్చింది. చివరకు గద్దె దిగవలసివచ్చింది.

జనతాపార్టీ ఎన్నికల ప్రణాళికలో పేరా 4. పుట 22 (ఇంగ్లీషు పుట) లో వెనుకబడిన వర్గాలవారికి కాలేల్కర్ కమిషను సిఫార్సుల మేరకు 25 నుంచి 33 శాతంవరకు ఉద్యోగాలను రిజర్వు చేయగలమని వాగ్దానం చేశారు. ఆయన ఈ వాగ్దానాన్ని అమలుపరిచారు. ఉత్తరువు జారీ కాగానే బీహారు రాష్ట్ర జనతాపార్టీలోనే కలవరం బయలుదేరింది. పార్టీ అధిష్టాన వర్గానికి ఫిర్యాదు చేశారు. పార్టీ జాతీయ కార్యవర్గం ఈ సమస్యను తుణ్ణంగా చర్చించింది. న్యాయంగా న్యాయశాఖా మంత్రి శ్రీ శాంతిభూషణ్ అధ్యక్షతన ఒక చర్చా కమిటీ పాట్నా వెళ్ళి విషయాన్ని అధ్యయనం చేసింది. ఠాకూర్ తీసుకున్న చర్య సరైనదేనని కమిటీవారు పార్టీ జాతీయ కార్యవర్గానికి నివేదించారు. నివేదికను అధిష్టానవర్గం ఆమోదించేవరకూ ఉత్తరువు అమలును ఆపిపెట్టి ఇప్పుడు అమలు ప్రారంభించారు.

ఇట్టి ఉత్తరువు అమలును వ్యతిరేకిస్తూ ఆ రాష్ట్ర జనతా పార్టీ అధ్యక్షునితోసహా దేశంలోని అగ్రకులాలవారు ఆందోళన చెందడానికి దేశంలోని అన్ని ప్రముఖ పత్రికల్లోనూ బీహారు రాష్ట్రానికి కర్పూరీ ఠాకూర్ చిచ్చుపెట్టాడని గగ్గోలుపెట్టే అవసరం ఎందుకు రావాలి? ఇది వైషమ్యాలు పెంచడం కాదా? నిజానికి కర్పూరీ ఠాకూర్ గారు పెట్టింది చిచ్చు కాదు —రవ్వంత దీపం — వెనుకబడిన వర్గాలవారికి వెలుగు చూపించే ఈ రవ్వంత దీపం యావత్ భారతదేశానికి కాంతిపుంజంగా పరిణమిస్తుంటే విప్లవ ప్రతీఘాత శక్తులకది చిచ్చులా కాలడం అసహజమేమీ కాదు.

పేదరికం అనేది ఉన్నత కులాల్లో లేదా? వెనుకబడిన తరగతులకు చెందినవారందరూ పేదవారేనా? అందులో సంపన్నులూ, భూస్వాములూ, పెట్టుబడిదారులూ లేరా? అని కొందరు ప్రశ్నిస్తూవుంటారు. పేదవారందరి సమస్యలూ ఒకటేనని, పేదవారిని ఉద్ధరించే కార్యక్రమంలో వెనుక ముందు అనేకులకూ ప్రమేయం వుండరాదని వాదిస్తుంటారు. పైవినే వారికి ఈ వాదన పైకి చాలా సబబుగా కనిపిస్తుంది.

ఉన్నత కులాల పేదవారిని ఉద్ధరించడానికి ప్రభుత్వం కృషి చేయకూడదని కానీ, ఉన్నతవర్గాలకుచెందిన పేదలు బాగుపడరాదని అనలేదు. ఉన్నతవర్గాల పేదలసముద్ధరణకోసం వెనుకబడిన తరగతులకు చెందిన పేదల నోరు కొట్టడం ఎంతవరకు న్యాయము అని ప్రశ్నిస్తున్నాను. ఉన్నత కులాల పేదలకు ఎలాంటి సహాయము జరగడము లేదేమోనని అపోహ కల్పించే యీ దుష్ప్రచారము వచ్చి అబద్ధాలు, ఉదాహరణకు మన రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖవారు ప్రతిభావంతులయిన పేద విద్యార్థులకు ఉపకార వేతనాలు ఇస్తుంటారు. ఈ కార్యక్రమానికి ఏటా సుమారు 80 లక్షల రూపాయలవరకు ఖర్చు చేస్తున్నది. ఈ మొత్తంనుండి ఒక్క నయాపైసాకూడా వెనుకబడిన తరగతులకు చెందిన ప్రతిభావంతులయిన పేద విద్యార్థులకు చెందడం లేదు. ఎందుకని?

అంతేగాక "ఆర్థికంగా వెనుకబడిన వర్గాలు" అని 1970 నుండి మన రాష్ట్రములో ఒక క్రొత్త వర్గాన్ని సృష్టించి ప్రతి ఏటా ఈ వర్గం పేరుతో మన ప్రభుత్వం సుమారు 80 లక్షలు రూపాయలు ఖర్చు చేయుచున్నది.

"ఆర్థికముగా వెనుకబడిన వర్గాలకన్న" పదానికి శబ్దార్థపరంగా పరిశీలిస్తే అన్ని వర్గాలలోని పేదలు అని అర్థం వస్తుంది. కాని ఈ వర్గాల పేరుతో ఇస్తున్న ఉపకార వేతనాలనుండి ఒక్క నయాపైసా అయినా వెనుకబడిన తరగతికి చెందిన పేదవానికి దక్కడంలేదు. ఎందుకని? వెనుకబడిన తరగతుల పేరుతో విడిగా కేటాయింపు వున్నది. కాదా? అని కారణం చెపుతారు. ప్రత్యేకవకాశమనేది సమాన అవకాశానికి అదనంగా వుంటుందే గాని ప్రత్యేకవకాశము యిస్తున్నామనే నెపముతో సమాన అవకాశాన్ని నిరాకరించడం ఘోరమైన అన్యాయం కాదా?

దీనినిబట్టి పేదవారందరికి సమానంగా సముద్ధరణ జరగాలన్న వాదనతో పేదల పరిధినుండి బహుజనులయిన వెనుకబడిన తరగతుల పేదలను దూరముగా వుంచుతున్నది వెనుకబడినవర్గాల పెద్దలు కారా?

"ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు" యిచ్చేదానిలో లేశమాత్రం వెనుకబడిన వర్గాలకు చెందిన నిరుపేదలకు ఇవ్వకపోగా —బడ్జెటులో వెనుకబడిన తరగతుల సంక్షేమానికి కేటాయించిన మొత్తాలను ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారికి కూడా ఖర్చు చేస్తున్నాం అనే ప్రగల్భాలు ప్రజలను మభ్యపెట్టడానికే కదా!

పేదలందరిని సమానంగా చూడాలిగాని యిందులో కుల ప్రమేయం పనికిరాదని వాదించేవారికి, నిజంగా పేదలపై కరుణ వుంటే — అగ్రకులాల్లోని సంపన్నులు ఎంతమంది, తమ కులాలకే చెందిన పేదవారికోసం తమ సంపదను, తమ అవకాశాలనూ త్యాగం చేయడానికి ముందుకు రాగలరో చెప్పండని సవాలు చేస్తున్నాను.

ఇది మెట్రిక్యులేషను లోపు చదువులకు సంబంధించినది. మెట్రిక్యులేషను తర్వాత చదువులకు స్కాలర్‌షిప్‌ల పేరుతో ఖర్చు చేసే రూ. 16,08,000 లోనుంచిగానీ, స్పెషల్ మెరిట్ స్కాలర్‌షిప్‌లుగా ఇచ్చే రూ. 5,51,000 లనుంచిగాని మెరిట్ స్కాలర్‌షిప్‌లుగా యిచ్చే రూ. 6 లక్షలనుంచిగానీ అంటే మొత్తం 277 లక్షల 59 వేల మొత్తంలో జాబితాలోని వెనుకబడిన తరగతులకు నయాపైసా భాగం లేదు.

దీనివల్ల తెలుస్తున్న దేమిటి? ప్రభుత్వం నూటికి 20 శాతంగానున్న ఉన్నతవర్గాలకు చెందిన పేద విద్యార్థులకు దాదాపు 2 కోట్ల రూపాయలకు పైగా ఖర్చు చేస్తూ నూటికి 40 శాతంగానున్న జాబితాలోని వెనుకబడిన పేద విద్యార్థులకు

the main issues to be considered at the State Level Conference. The discussions and the recommendations of this State Level Conference would strengthen the hands of Government to undertake major ameliorative measures for the early solution of the problems of Backward Classes.

I have great pleasure in extending my greetings and felicitations to the participants of the Conference and in wishing their deliberations all success.

GOVIND NARAIN,
*Governor of Karnataka.*



123 4

నిర్ధారించడానికి' "గీటు రాయిని" సూచించవలసిందిగా కోరింది. కమీషను నివేదికలో స్పష్టమైన గీటురాయిని సూచించడం జరుగలేదని, కేంద్ర ప్రభుత్వం ఈ విషయమై ఇంకా పరిశీలనలు జరపాల్సి వుందంటూ కమీషను నివేదికను బుట్టదాఖలు చేసింది.

అంతేకాదు - కమషనువారు తయారుచేసిన జాబితా కులాల ప్రాతిపదికపై ఉన్నది కనుక - దాన్ని పాటించడానికి వీలులేదంటూ అప్పటి కేంద్ర హోం మంత్రి గోవింద వల్లభ పంత్ గారు బహిరంగ ప్రకటన కూడా చేశారు. హరిజనుల జాబితా కులాల ప్రాతిపదికపై ఉండవచ్చు. గిరిజనుల జాబితా కులాల ప్రాతిపదికపై ఉండవచ్చు కాని - వెనుకబడిన తరగితుల జాబితా మాత్రం కులాల ప్రాతిపదికపై ఉండరాదా ? సాంఘికంగా వెనుకబడినతనమని నిరూపించడానికి కులము తప్ప మరొక కొలతబద్ద చెప్పగలరా ? ఈనాటి సాంఘిక అసమానతకు మూలం కుల వ్యవస్థే అయినప్పుడు దాన్ని రూపుమాపడానికి ఆ కుల ప్రాతిపదికను గుర్తించకపోతే ఎలా సాధ్యమౌతుంది?

ఈ పరిస్థితిలో ఆనాటి ఆంధ్ర రాష్ట్ర వెనుకబడిన తరగతుల సంఘ ఆధ్వర్యాన 1956లో ఢిల్లీలో కీ. శే శ్రీ పంజాబ్‌రావు దేశ్‌ముఖ్ గారి అధ్యక్షతన అఖిల భారతీయ వెనుకబడిన తరగతుల మహాసభ జరిపాం. వెనుకబడిన తరగతుల పట్ల కేంద్ర ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ తీర్మానాలు చేశాం. హోంమంత్రి శ్రీ పంత్ గారి వద్దకు రాయబారం వెళ్ళాం. ఆయనకొక సవివరమైన విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు.

ఫలితంగా ఉన్నత విద్యాభ్యాసానికి వ్యక్తిగత ప్రాతిపదికపై ఇదివరకు కేంద్ర ప్రభుత్వం ఇస్తూ వుండిన స్కాలర్‌షిప్‌లకు కేటాయించిన మొత్తాన్ని ఆయారాష్ట్ర ప్రభుత్వాలకు బదలాయిస్తామని, రాష్ట్ర ప్రభుత్వాలు తమకు తోచిన రీతిలో వీటిని పరచవచ్చునని ఆయన హామీ యిచ్చారు, అయితే ఈ పద్ధతి ఒక్క సంవత్సరమే అమలు జరిగింది. విద్యార్థులకు ఇచ్చే స్కాలర్‌షిప్ కులాల ప్రాతిపదికపైగాక, ఆర్థికంగా వెనుకబడినతనం ప్రాతిపదికగా మంజూరు చెయ్యాలని 1957 లో కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించింది. బ్రిటిష్ ప్రభుత్వ కాలం నుండి ఉన్నత విద్యకై వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ఇస్తూ వుండిన స్కాలర్‌షిప్‌లను యీ విధంగా రద్దు చేసిందే కాని- కేంద్ర ప్రభుత్వం వెనుకబడిన తరగతుల వారికి ఈ 32 సంవత్సరాల కాలంలో ఏమీ చెయ్యలేదని చెప్పడానికి విచారిస్తున్నాను.

ఇప్పటికి జరిగిన అన్ని సాధారణ ఎన్నికలలోనూ దేశంలోని దాదాపు అన్ని రాజకీయ పార్టీల ఎన్నికల ప్రణాళికలను పరిశీలిస్తే వెనుకబడిన వర్గాల సంక్షేమం కోసం కృషి చేయగలమని ఎన్నికలలో వాగ్దానం చెయ్యని రాజకీయ పార్టీ ఒక్కటి కూడా లేదని చెప్పవచ్చు. నాయకుల ఉపన్యాసాలలోనూ ఎన్నికల వాగ్దానాలలోనూ చూపించినంత ఉత్సాహం ఆచరణలో లేదని చెప్పడానికి చింతిస్తున్నాను.

ఇక మన రాష్ట్రం విషయానికి వద్దాం. మొదట ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగంగా ఆంధ్ర రాష్ట్రంలో వెనుకబడిన వర్గాల పోరాటం ప్రారంభమైంది. అంతకు ముందు ఆంగ్లేయుల కాలం నుంచీ ఆ రాష్ట్రంలో వెనుకబడిన వర్గాల జాబితాలే ఒకటి అమలులో ఉండేది. ఆ జాబితాలో ఉన్న కులాల వారికి ఉద్యోగాల్లో రిజర్వేషన్లూ, విద్యా సంస్థలలో సీట్ల రిజర్వేషన్లూ - ఉపకార వేతనాలూ అమలులో ఉండేవి. దీనిని ఆరోజుల్లో కమ్యూనల్ జి. ఓ. అనే వారు. స్వతంత్రం వచ్చి రాజ్యాంగ చట్టం అమలు పరచగానే 1952 లోనే ఆ జాబితా చెల్లదని రాజ్యాంగం యొక్క 14, 29 (2)వ అనుచ్ఛేదం క్రింద ఉన్నత కులాలవారు న్యాయస్థానాలకు వెళ్లారు. మద్రాసు హైకోర్టు ఈ ఉత్తరువును రద్దు చేసింది. అప్పుడు మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుండేవారు. మరోవైపు పెరియార్ ఈ. వి. రామస్వామి నాయకర్, అన్నాదురైల నాయకత్వంలో వెనుకబడిన వర్గాల విప్లవ పోరాటం ఉధృతంగా ఉన్న రోజులవి.

శ్రీ రాజాజీ ఢిల్లీ వెళ్ళి అప్పటి ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారికి నచ్చచెప్పి రాజ్యాంగంలోని 15, 16 వ అనుచ్ఛేదాలను సవరించి దక్షిణాది రాష్ట్రాలలో అమలులో ఉన్న రిజర్వేషన్లకు రాజ్యాంగ రక్షణ కల్పించారు.

ఈ విధంగా స్వాతంత్ర భారత రాజ్యాంగాన్ని మొట్టమొదటి సారిగా సవరించవలసిరావడానికి వెనుక బడిన వర్గాల సమస్యే కారణం కావడం చరిత్రాత్మకమైనది.

ఇటు హైదరాబాదు రాష్ట్రంలో కూడా వెనుక బడిన వర్గాల జాబితా ఒకటి ఉండేది. ఆ జాబితా ననుసరించి ఉద్యోగాల్లో విద్యా సంస్థలలో 25 శాతం రిజర్వేషన్లు అమలులో ఉండేవి హైదరాబాదు ప్రభుత్వం వెనుకబడిన వర్గాల సంక్షేమం కోసం బడ్జెటులో ప్రత్యేక కేటాయింపులు చేస్తూ వుండేది.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత 1957-58 లో వెనుకబడిన తరగతుల జాబితా చెల్లనేరదని హైకోర్టులో సవాలు చేయడం, ఆంధ్రప్రదేశ్ హైకోర్టువారు జాబితాలను కొట్టివేయడం జరిగింది. దీనిపై వెనుకబడిన తరగతుల సంఘం పక్షాన సుప్రీంకోర్టుకు అప్పీలు చేస్తే సుప్రీంకోర్టు వారు అప్పీలును కొట్టివేశారు.

తరువాత 1960లో శ్రీ దామోదరం సంజీవయ్యగారు ముఖ్యమంత్రి కాగానే వెనుకబడిన తరగతుల జాబితాను పునరుద్ధరించారు, ప్రమోషన్లలో సైతం రిజర్వేషన్లు పద్ధతిని అనుసరించాలని ఆదేశాలు జారీచేశారు. అయితే యీ జాబితా కూడ చెల్లకూడదంటూ హైకోర్టులో సవాలు చేయడం- హైకోర్టువారు మొత్తం జాబితాలను కొట్టివేయడం జరిగింది. దీనిపై సుప్రీంకోర్టుకు రాష్ట్రప్రభుత్వం చేసిన అప్పీలు కూడా కొట్టివేశారు.

C. M. POONACHA
*Governor,*
*Madhya Pradesh.*

*Raj Bhavan,*
*Bhopal,*
11*th April,* 1979.

I am happy to learn that the Andhra Pradesh Government have decided to hold the State Level Backward Classes Conference on 28th and 29th of April, 1979. The general welfare of the Backward Classes, with special emphasis on educational and social activities would, I am sure, be highlighted at this Conference and necessary guidelines be formulated for the purpose.

I wish the Conference all success.

C. M. POONACHA.

ఇదివరకటి కమిషనువారు తయారు చేసిన జాబితా ఉండగా, అనేక రాష్ట్రాలలో వెనుకబడిన తరగతుల జాబితాలు విడివిడిగా అమలులో ఉండగా—అన్నిటికన్నా ముఖ్యమైన విషయం—సుప్రీం కోర్టు వారు కూడా "సాంఘికంగా విద్యా విషయకంగా వెనుకబడిన వారే వెనుకబడిన తరగతుల వారని స్పష్టంగా ధృవీకరించిన తీర్పు యిచ్చి ఉండగా మళ్ళీ "గీటురాయిని" రూపొందించమని కమిషను వారిని ఆదేశించడం పట్ల కేంద్ర ప్రభుత్వ దృక్పథము సందేహించవలసివస్తున్నదని చెప్పుటకు విచారిస్తున్నాను

హరిజన, గిరిజన మరియు వెనకబడిన వర్గాలకిచ్చే రాజ్యాంగ పరమైన రక్షణలు 1980తో అంతముగా నున్నవి. బలహీన వర్గాలన్నిటిని అభ్యున్నతికి తెస్తామనియు, రక్షణలను మరో పదేళ్ళపాటు అనగా 1990 వరకు పొడుగిస్తామని 1976లో అప్పటి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధిగారు ఉపన్యాసాలిచ్చారు. అప్పటి ఎమర్జెన్సీ కాలములో వారు హరిజన, గిరిజనులకే రక్షణలను పొడిగించారు. కాని వెనుకబడిన తరగతులకిచ్చే రక్షణల గురించి వారుగాని, వారి సహచరులు గాని యేమాత్రం పట్టించుకోలేదని చెప్పక తప్పదు.

వెనుకబడిన తరగతులకు సంబంధించిన రాజ్యాంగ పరమైన రక్షణల గడువు 1980తో పూర్తి కాకుండగా 1979లో వెనుకబడిన తరగతుల కమీషన్ నియమించడము దేనికి? యింత వరకు లేశమాత్రమైన సౌకర్యము చేయకుండా ఉన్న కేంద్ర ప్రభుత్వము, యీ గడువును మరొక 10 ఏండ్ల వరకు పెంచాలి.

మండల్ కమీషన్ తీర్పు ఇచ్చేవరకు జాప్యం చెయ్యక వెంటనే, కేంద్ర ప్రభుత్వం రంగాల్లోనూ ముఖ్యంగా యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్ ఉద్యోగాల్లోనూ, రైల్వే, పోస్టలు ఉద్యోగాల్లోనూ కేంద్ర ప్రభుత్వం చేపట్టిన పరిశ్రమల్లోనూ రాష్ట్రంలోని వెనుకబడిన తరగతుల వారికి 30 శాతం కేటాయించాలని కేంద్ర ప్రభుత్వంపై రాష్ట్ర ప్రభుత్వం ఒత్తిడి తెచ్చిననాడే వెనుకబడిన తరగతుల వారికి న్యాయం చేకూరుతుందని నేను భావిస్తున్నాను.

—

# వెనుకబడిన తరగతుల సమస్యలు

ఎ. చక్రపాణి *

వెనుకబడిన తరగతులవారు హిందూ సమాజంలో ఒక
త్యేక తెగకు చెందినవారు. విద్య లేకపోవడం వలన సాంఘిక
గా త్రొక్కి-వేయబడినందువలన కొన్ని కులాలవారు సమా
లో వెనుకబడి వున్నారు. కొన్ని కొన్ని వెనుకబడిన తరగ
కుటుంబములు ఆర్థికముగా ఉన్నత స్థితిలో వున్నప్పటికీ
ఘికంగా వెనుకబడితనము వారిని బాధించుచున్నది. ఈ
యమును రాజ్యాంగకర్తలు గుర్తించి రాజ్యాంగ సవరణ
సినప్పుడు వెనుకబడిన తరగతులవారిని సాంఘికముగా,
్య విషయకముగా వెనుకబడి వున్నారని మాత్రమే
్కనిరి. కాబట్టి ఆర్థిక వనరులతో సంబంధములేని ఒక
వ్యవస్థ భారతదేశములో కలదు. ఆ వ్యవస్థనే మనము
కబడిన తరగతులవారని వ్యవహరించుచున్నాము.

మన రాజ్యాంగము ప్రకారము ప్రత్యేక ఉద్యోగ సదు
యములు, విద్యాలయ ప్రవేశమునకు ప్రత్యేక సదుపాయ
ు, స్కాలర్‌షిప్‌లు వగైరా ఆర్థికసహాయము కలుగచేయు
అవకాశమున్నది. కాని కొన్ని విషయములలో ప్రభుత్వ
ము లున్నప్పటికి అమలు జరుపువారు సానుభూతి చూప
వలన వెనుకబడిన తరగతులవారికి జరుగవలసిన సహాయము
ర్తిగా అందుటలేదు. మనకు స్వరాజ్యము లభించి ముప్పది
త్సరములు పైబడినప్పటికి వెనుకబడిన తరగతుల వారిలో
లసిన మార్పు రాలేదు. దీనికి కారణము వెనుకబడిన
తులవారు బహుసంఖ్యలో నుండుట, ఉద్దేశింపబడిన సహా
ము పూర్తిగా సకాలములో అందకపోవుట కారణములై
న్నవి. ఈ దోషములను చిత్తశుద్ధితో సరిదిద్దినగాని
చిన ఫలితములు సాధింపజాలము. వెనుకబడిన తరగతుల
ప్రగతి ఎండమావులుగా నిలిచిపోవు ప్రమాదము కలదు.
ట్టి సాంఘిక న్యాయముకొఅకు కృషి చేయదలచిన ప్రభు
ు వెనుకబడివ తరగతులవారి ప్రగతికి సత్వరచర్యలు
ొనవలసి వున్నది.

సాంఘికన్యాయము సాంఘిక సమానత్వముమీద ఆధార
యున్నది. చదువు, తెలివితేటలు, ఆరోగ్యము, అవగాహన
, వాక్చాతుర్యము కలిగిన వెనుకబడిన తరగతులవారు
త కులములవారితో సరిసమానముగా చూడబడుటలేదు.
సాంఘిక పరిస్థితులే కారణము. అనేక వేల సంవత్సరముల
నుండి పుట్టుకను ఆధారముగాచేసుకొనిసాంఘికవిలువలు సృష్టింపబడిన మన సమాజంలో వ్యక్తి గౌరవం అతని శక్తియుక్తులపై ఆధారపడలేదు. సాంఘికముగా వ్రేళ్ళు పాతుకొన్న దురాచారములు, మూఢ నమ్మకములు దీనికి కారణము. ప్రజాగణతంత్ర రాజ్యమైన భారత దేశంలో యిట్టి సాంఘిక వ్యత్యాసములు వుండరాదు. వాటిని జాగు చేయక యెంత తొందరలో నిర్మూలము చేసిన అంత మంచిది.

"విద్యా విహీన: పశు:" అన్నది ఆర్యోక్తి. విద్యలేనివాడు వింత పశువు కాక మానడు. సాంఘిక పునర్నిర్మాణమునకు విద్యా వ్యాప్తి మొదటి మెట్టు. కుల వృత్తిని అవలంబించుచు దానిపై వచ్చు స్వల్పాదాయముతో తృప్తి పడు వెనుకబడిన తరగతుల వారు విద్య నభ్యసించి తమ దీనస్థితిని తొలగించుకోవలయును. ప్రభుత్వ సహాయము లేనిదే విద్య నభ్యసించుట వెనుకబడిన తరగతుల వారికి అసాధ్యము. నిర్బంధ విద్య ప్రవేశపెట్టుట యెంతైనా అవసరము. విద్యాలయములలో కొంత దామాషా ప్రకారము సీట్లు వెనుకబడిన తరగతులకు ప్రస్తుతము కల్పించుచున్నారు. కాని యీ సదుపాయము అన్ని తరగతుల విద్యాభ్యాసమునకు అందుబాటులో లేదు. కాబట్టి క్రింద నుండి పై వరకు అన్ని విద్యా సంస్థలలోను రిజర్వేషన్ సదుపాయము అమలు పరచవలెను.

ఉపకార వేతనములు విద్యాభివృద్ధికి యెంతైనా అవసరము. ప్రస్తుత ఆదేశముల ప్రకారము 6,000 రూ. లు సంవత్సరాదాయమునకు లోబడిన వారికి మాత్రమే ఉపకార వేతనము పొందుటకు అర్హత గలదు. కాని పై ఆదాయ పరిమితిలో ఉన్న వెనుకబడిన తరగతుల విద్యార్థులందరకు ఉపకార వేతనము లభించుట లేదు. దీని వలన వెనుకబడిన తరగతులలో విద్యాభ్యాసము త్వరితగతిని జరుగుటకు వీలు లేక పోవుచున్నది. ప్రభుత్వము వెనుకబడిన తరగతుల వారి అభివృద్ధిని నిజముగా కోరుచున్న యెడల ఉపకార వేతనములు రాబడి పరిమితిలో వున్న వారికందరకూ యివ్వవలసి యున్నది. లేని యెడల సమస్య పరిష్కారము కాదు.

విశ్వ విద్యాలయములలో పాలనాధికారము కలిగిన అకడమిక్ కౌన్సిలు, సిండికేటు, సెనేటు మొదలైన సంస్థలలో

* ఛీఫ్ విప్, ఆంధ్రప్రదేశ్ శాసనమండలి.

గూడ వెనుకబడిన తరగతులకు తగిన సంఖ్యలో రిజర్వేషను యివ్వవలసియున్నది. అట్లుజరిగిననాడు విశ్వవిద్యాలయములలో వెనుకబడిన తరగతులకు తగిన సదుపాయములు చేయుటకు అవకాశమున్నది.

ప్రభుత్వోద్యోగములలో వెనుకబడిన తరగతుల వారికి రిజర్వేషను ముఖ్యమైన విషయము. ప్రస్తుత ఆదేశముల ప్రకారము 25% ఖాళీలు వెనుకబడిన తరగతుల వారికి యివ్వవలసియున్నది. జనాభా ప్రాతిపదిక ననుసరించి పై సంఖ్య తక్కువైనప్పటికి ఆ సంఖ్యలో కూడ ఉద్యోగ నియామకములు సరిగ్గా అమలు జరుపుట లేదని చెప్పబడుచున్నది. అయితే యీ రిజర్వేషను ప్రాథమిక దశలో ఉద్యోగ ప్రవేశమునకు మాత్రము యివ్వవలెనా ? లేక ప్రమోషను సమయములోను కూడా యివ్వవలెనా? అన్నది వివాదాంశముగానే యున్నది. 1961 వ సంవత్సరములో స్వర్గీయ దామోదరం సంజీవయ్య గారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు G. O. 559 తేది 4-5-1961 న జారీచేసి వున్నారు. దీని ప్రకారము మొదటి సారి ఉద్యోగ ప్రవేశము చేసినపుడు యిచ్చే రిజర్వేషన్లు ప్రమోషను తదితర నియామకాలకు కూడా వర్తించవలెనని నిర్ణయింపబడినది. కాని అప్పటి వెనుకబడిన తరగతుల జాబితా సరియైన పరిశీలన చేయకుండా జారీ చేయబడినదని నిర్ణయించి న్యాయస్థానమువారు ఆ జాబితాను రద్దుపరచిరి. కాని కొందరు ప్రమోషన్లలో రిజర్వేషను పద్ధతి రాజ్యాంగ విరుద్ధమని ప్రచారము చేసిరి. అది నిజము కాదు. సుప్రీం కోర్టువారు తరువాత యిచ్చిన తీర్పులలో రిజర్వేషను పద్ధతి ప్రమోషన్లలో అమలు పఱచుటకు వీలున్నదని చెప్పిరి. కాబట్టి సరియైన సంఖ్యలో వెనుకబడిన తరగతుల వారు ఉద్యోగ అవకాశము సంపాదించునంత వఱకు, రిజర్వేషన్ అమలు జరుపుట అవసరము. షెడ్యూల్డ్ కులాల వారికి 14 శాతము షెడ్యూల్ జాతు వారికి 4 శాతము ఉద్యోగాలలో ప్రస్తుతము రిజర్వేషను అమల జరుగుచున్నది. కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము వార కూడా యీ రిజర్వేషనును అమలు జరుపుచున్నారు. దే జనాభాలో షెడ్యూల్డ్ కులాల యొక్క, షెడ్యూల్డ్ జాతు యొక్క జానభా శాతముననుసరించి యీ రిజర్వేషన్లు జరుగ చున్నది. కాని వెనుకబడిన తరగతుల వారికి జనాభా ప్రా పదిక లెక్కలోనికి తీసుకోనలేదు. వీరికి గూడ జనాభా శాతమ ననుసరించి ఉద్యోగములతో రిజర్వేషన్లు అమలు జరుపవలెను ప్రమోషను సమయములలో కూడ రిజర్వేషను యిచ్చిన కా తగిన శాతములో వెనుకబడిన తరగతుల ప్రభుత్వోద్యోగమ లలో స్థానము సంపాదించుటకు వీలు పడదు.

కొంతమంది వెనుకబడిన తరగతుల వారికి బ్యాంకు ద్వారా, తదితర ఆర్థిక సంస్థల ద్వారా ఆర్థిక సహాయమ చేయుచున్నారు. కాని ఆ సహాయము తగినంతగా లేనంద వలన యెక్కువ మందికి లాభదాయకముగా లేదు. అంతేకా అనేక షరతులు పెట్టుటవలన సులభముగా వెనుకబడిన తరగత లవారికి ఆర్థిక సహాయము లభించుట లేదు. తగిన ఆస్తి హామి చూపించవలసి వచ్చుట యిందులో ముఖ్యమైన షరతు దీనిని వెనుకబడిన తరగతులవారు పూర్తి చేయులేక పో చున్నారు. ఆర్థిక సహాయము కావలసిన వెనుకబడిన తరగతు వారికి ఆస్తిపాస్తులు లేకపోవుటయే దీనికి కారణము. అందుచే ప్రభుత్వము బ్యాంకులకు హామీ నిలబడి వెనుకబడిన తరగతు వారికి సహాయము చేయవలసియున్నది.

—

# వెనుకబడిన వర్గాలకు స్థిరమైన సాంఘిక న్యాయం

కొండా లక్ష్మణ్ బాపూజీ*

భారత రాజ్యాంగం, సమాజంలోని బలహీన వర్గాలను ాలుగు రకాలుగా విభజించింది అవి 1. షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు, 3. సాంఘిక విద్యావిషయకంగా వెనుక డిన తరగతులు. 4. ఆర్థికంగా బలహీన వర్గాలు. మూడవ రకం షయంలో భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు సాంఘి ంగా, విద్యావిషయకంగా వెనుకబడివున్న తరగతులని గుర్తించి వకటించిన తరగతులను సాంఘికంగా, విద్యా విషయకంగా ెనుకబడిన తరగతులని గుర్తించింది. కాని 1952 లో యితర ెనుకబడిన తరగతులపై కాకా కాలేల్కర్ సంఘాన్ని నియ ంచిన తరువాత, కేంద్ర ప్రభుత్వం ఆ వెనుకబడిన తరగతు ుకు డినోటిఫై చేసి అంతకు ముందు వారికి లభింపచేసిన ప్రత్యేక ినహాయింపులను, ఈ సంఘం నివేదిక అందేవరకు నిలిపి ేసింది. కాకా కాలేల్కర్ సంఘం తన నివేదికను 1953 లో మర్పించినది. కాని ఈ నివేదిక ప్రాతిపదికపై సాంఘికంగా ిద్యా విషయకంగా వెనుకబడిన తరగతుల వారికి సంబంధించి లాంటి జాబితాను తయారు చేయలేదు. దీని ఫలితంగా రాజ్యాం ంలో వారి అభ్యున్నతికై ఏర్పాటుచేసి ప్రత్యేక మినహా ుంపులను తొలగించడం జరిగి ఈ తరగతులకు ఘోరమైన ాన్యాయం జరిగింది. కేంద్ర ప్రభుత్వానికి ఈ విషయమై ఎన్ని జ్ఞప్తులు చేసినా భారత రాజ్యాంగం క్రింద తమ బాధ్యతలను ిర్వర్తించాలనే ఉద్దేశాన్ని కనబర్చ లేదు. కేంద్ర ప్రభుత్వం ాతీయ నాయకులు ముఖ్యంగా పురోగామి తరగతులకు ంందిన వారు "వెనుకబడిన తరగతులు" అనే పదాన్ని వాడి ప్పుడు వారు షెడ్యూల్డు కులాలను, షెడ్యూల్డు జాతులను ాత్రమే దృష్టిలో పెట్టుకున్నారు. ఈ రోజుల్లో 'బలహీన ర్గాల' పట్ల ఎంతో ఆందోళన వ్యక్తం చేయబడుతున్నది. బల ీన వర్గాలు అన్నప్పుడు మన అనుభవాన్ని బట్టి, షెడ్యూల్డు ులాలు, షెడ్యూల్డు జాతులే కాక ఆర్థికంగా వెనుకబడిన ురోగామి తరగతుల కుటుంబాలను కూడ ఇందు చేరుస్తు న్నారు.

సాంఘికంగా విద్యా విషయకంగా వెనుకబడిన తరగతుల జాబితాను రూపొందించే పనిని అనేక రాష్ట్ర ప్రభుత్వాలు ఇంకా ప్రారంభించలేదు. కొన్ని రాష్ట్రాలు ఈ పనిని ప్రారంభించాయి కాని యింకా పూర్తి చేయలేదు. అయితే కొన్ని రాష్ట్రాలు మాత్రం సాంఘికంగా విద్యా విషయకంగా వెనుకబడిన తరగతులను గుర్తిస్తూ ప్రకటించి వారి వారి అభ్యున్నతికి దాన్ని మినహాయింపులు ఇచ్చారు. ఈ జాబితాలు కూడ సమగ్రంగా లేవు. ఈ తరగతుల అభ్యున్నతికై ప్రకటించిన మినహాయింపులు కూడ తగినంతగా లేవు. ఇచ్చిన మినహా యింపులు కూడ సరిగా అమలు కావడంలేదు.

కేంద్ర ప్రభుత్వం. సాంఘిక న్యాయం గురించి ఎన్ని పెద్ద కబుర్లు చెప్పినా, సాంఘికంగా, విద్యావిషయకంగా వెనుకబడిన తరగతుల జాబితాలను రూపొందిస్తుందని కాని, లేక కనీసం రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన జాబితాలను ఆమోదించి, వారి అభ్యున్నతికై, షెడ్యూల్డు కులాలు. షెడ్యూల్డు జాతుల పద్ధతిలో ప్రత్యేక మినహాయింపును చేస్తుందని కాని ఆశించే అవకాశం లేకుండా యుండినది.

జనతా పార్టీ ఎన్నికలలో ఇచ్చిన తన హామీని జనతా పార్టీ ప్రభుత్వం కూడ నిలబెట్టుకోలేదు. ఎంతో కాలక్షేపము చేసిన తర్వాత అనేక ఒత్తుడులకు తట్టుకోలేక ఇటీవలనసే వెనుక బడిన వర్గాల కమీషన్‌ను నియమించినది. అయితే ఈ కమీషన్ వెనుకబడిన వర్గాల పద్దును తయారుచేసి వారికి ఇవ్వవలసిన కేటాయింపు గూర్చి భారత ప్రభుత్వమునకు సిఫార్సు చేయు నున్నది. ఈ పనులు ఒక సం॥లోనే పూర్తి చేయబడును అని అంటున్నప్పటికి ఈ కమీషన్ తన నివేదికను ఎప్పుడు ఎంత కాలంలో పూర్తిచేయగల్గుతుందో? వాటిపై భారత ప్రభుత్వం నిర్ణయం తీసుకొనుటకు ఎంత సమయం పడుతుందో? అసలా రిపోర్టు గతి కాకా కలేల్కర్ కమీషన్ రిపోర్టు గతి మోస్తరు గానే కాగలదనే సందేహాలు కూడ లేకపోలేదు. అలా కాకుండా

*మాజీ మంత్రి

చూడటానికి వెనుకబడిన వర్గాలు ఎంతో జాగ్రత్తపడి యుండి సంఘటితంగా దేశ నలుమూలల నుండి పూనుకొనవల్సిన అవసరము ఎంతైన కలదు. ఈ విషయం వెనుకబడిన వర్గాల కార్యకర్తలకు మరియు నాయకులకు ప్రత్యేకంగా ఒక పిలుపుగా యుండగలదు.

1952 నుండి ఆంధ్ర ప్రదేశ్‌లో వెనుకబడిన వర్గాల సర్వతోముఖాభివృద్ధికి పూనుకొనటం జరిగింది. అప్పటి నుండి నిర్విరామంగా ఈ విషయంలో నేను నిర్వహించే పాత్ర అందరికి విదితమే. రాష్ట్ర ప్రభుత్వం వారు వెనుకబడిన వర్గాలకు గుర్తింపు ఇచ్చి ప్రత్యేక కేటాయింపులు ఇవ్వవలెననే విషయం కొరకు ఎన్నో ప్రయత్నాలు చేయవలసి వచ్చినది. ప్రభుత్వ అనుకూలమైన నిర్ణయాలను రెండుసార్లు హైకోర్టు కొట్టి వేయటం జరిగింది. చివరకు సుప్రీం కోర్టు నుండి న్యాయం పొందగల్గినాము. ఆ విధంగా సుమారు 20 సం॥ల ప్రయత్న ఫలితంగా 1972 లో ప్రభుత్వ నిర్ణయాన్ని అమలులో పెట్టుటకు వీలు కల్గినది. ఇది 1970లో ప్రభుత్వం నిర్ణయం చేసిన విధంగా 10 సం॥ల కొరకు మాత్రమే ఇట్టి ప్రత్యేక కేటాయింపులు వెనుకబడిన వర్గాలకు లభించును. గత 9 సం॥లలో ఈ వర్గాల కొరకు ప్రభుత్వం చేతనయినంత చేయనప్పటికి, చేసిన వాట్లో కూడ కొన్ని జాప్యములు జరిగినను అనేక విధములుగా వెనుకబడిన వర్గాలకు మేలు కల్గిందనేది నిస్సందేహము. అయితే 10 సం॥ల పరిమితి అంతమవుతున్న ఈ కాలంలో అట్టి పరిమిత

కాలంను పొడిగించవల్సిన అవసరాన్ని గమని
ప్రభుత్వ పక్షమున, జిల్లా మరియు రాష్ట్ర స్థా
బడిన వర్గాల సమావేశాలు, సభలు జరిపి వారి
నిర్మొహమాటంగా చర్చించి తీర్మానాలను తే
రూపొందించే అవకాశం కల్గించటం అనేది
నీయమైనది. ఇట్టి సభల (సదస్సు) వ్యవస్థలలో
కూడ ప్రముఖ పాత్రలు కల్పించియుంటే ఇం
కరమైన ఫలితాలు ఎక్కువగా కనబడేదివి. ఏ
గాని ఈ సమావేశాలలో, సభలలో రూపొందించ
మరియు తీర్మానాలను రాష్ట్రప్రభుత్వం అమలు
హృదయ పూర్వకంగా పూనుకోగలదని
అయినను వాటిని సరిగా అమలు జరుపబడుటకుగా
వర్గాలవారు చాల జాగ్రత్త వహించవలసి
విషయాన్ని మరువరాదు. కేవలం ప్రభుత్వ ప్ర
యింపులపై మరియు ప్రభుత్వ యంత్రాంగము
యుండటం సరియైనది కాదు. వెనుకబడిన
పరస్పర కలయికలతో చైతన్యమయులై సంఘటి
సాహసములతో, ముందంజ వేసి కృషి చే
స్థిరమైన సాంఘిక న్యాయం చేకూరగలదు. అయ
గల కార్యకర్తలు మరియు నాయకులు ఈ
ప్రత్యేకమైన బాధ్యత వహించవల్సిన అవసరం
కలదు.

---

# మన సంక్షేమం మన చేతుల్లోనే

ప్రగడ కోటయ్య*

చదువులోను, సంఘంలోను వెనుకబడిన వర్గాలను వెనుకబడిన తరగతులుగా గుర్తించి, వారి పురోవృభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలని మన రాజ్యాంగములో చెప్పబడింది.

ఈ తరగతుల సత్వరాభివృద్ధి కొరకు ఇండియా ప్రభుత్వము అనుసరించదగు విధానాన్ని రూపొందించి, నివేదించుటకై మన రిపబ్లిక్ అధ్యక్షుడు ఒక కమీషన్‌ను నియమించాలని కూడా మన రాజ్యాంగములో చెప్పబడింది.

మన రాజ్యాంగము అమలులోకి వచ్చి ముప్పయి సంవత్సరాలు కావచ్చింది. కాని యీ వెనుకబడిన తరగతుల ప్రజలకు చెప్పుకోకలిగిన సాయము మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలనుండి అందలేదనడము పొరబాటు కాదు.

మన రాష్ట్ర ప్రభుత్వము వెనుకబడిన తరగతుల విద్యాభివృద్ధికై కొంతవరకు సాయపడుతూ వుంది. అందుకై కేటాయించిన నిధులలో 30 శాతము మిగతా అన్ని అభివృద్ధి చెందివున్న కులాలలోని పేద విద్యార్థుల కొరకు వెచ్చించబడుతూవుంది. నిజానికి పేద విద్యార్థులందరికి, వారేకులము వారైనా ప్రభుత్వము సాయపడటం ధర్మము. అందుకై ప్రత్యేకించి నిధులను కేటాయించాలి తప్ప, వెనుకబడిన తరగతుల విద్యార్థుల సాయం కొరకు కేటాయించిన నిధుల నుండి 30 శాతము వెచ్చించడము సరికాదు. అచ్చటచ్చట యీ వ్యయము 30 శాతానికి మించి కూడా జరుగుతున్నది.

ఇంతకీ వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ప్రభుత్వము చేస్తున్న సహాయము ఏపాటిది? పదియవ తరగతి వరకు 20 లక్షలకు పైగా వెనుకబడిన తరగతుల విద్యార్థులుండగా, అందులో 40 వేల మందికి మాత్రమే ప్రభుత్వము కొంత సాయపడుచున్నది. అంటే 2 1/2 శాతం విద్యార్థులకు మాత్రమే ప్రభుత్వ సహాయం అందుతున్నది. ఇక 10వ తరగతికి పైబడిన అన్ని చదువులలోను వెనుకబడిన తరగతుల విద్యార్థుల సంఖ్య ఒక లక్ష వరకు వుంది. అందులో 30 వేల మందికి ప్రభుత్వ సాయం కొంతవరకు అందుతూ వుంది. అంటే 30 శాతము విద్యార్థులకు మాత్రమే ప్రభుత్వ సాయం ముట్టుచున్నది. ఈపరిస్థితులలో వెనుకబడిన తరగతులు చదువులో మిగిలిన అందరి స్థాయిని అందుకోవాలంటే, ఎంత కాలం పట్టుతుందో వూహించి చెప్పడం కష్టము.

6–11 సంవత్సరాల లోపు బిడ్డలందరికి నిర్బంధంగా ప్రాథమిక విద్యను బోధించడం ప్రభుత్వ విధి. కాని అందుకు అవసరమైన చర్యలను తీసికొనలేదు.

2వ పంచవర్ష ప్రణాళికా కాలములో వెనుకబడిన తరగతులు విశేషంగా వున్న ప్రాంతాలలో యేకోపాధ్యాయ పాఠశాలలు యేర్పాటు చేశారు. అట్టి పాఠశాలల సంఖ్య మన రాష్ట్రములో 20 వేలకు పైగా వుంది. అప్పటికీ యిప్పటికీ ఆ పాఠశాలలలో హెచ్చు సంఖ్యకు భవనాలు లేవు. మురికివాడలలో పడిపోతున్న పూరి గుడిసెలలో యీ పాఠశాలలు నిర్వహించబడుతూ వున్నాయి. ఆ గుడిసెలలో పాఠశాలలు పని చేయని సమయాలలో కుక్కలు, పందులు పొర్లాడుతూ వుంటాయి ఆ పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య యిప్పుడు ఒక్కొక్కదానిలో 100కి మించి పోయాయి, ఐదు తరగతులు వున్నప్పటికి, ఒకే ఒక ఉపాధ్యాయుడు ఐదు తరగతులలోని విద్యార్థులకు చదువులు చెప్పాలి. అదెంతవరకు సాధ్యమో వూహించవచ్చును. పేరుకు పాఠశాలలు, ఉపాధ్యాయులు తప్ప, విద్యార్థుల చదువుచెప్పటానికి పనికివస్తున్న పాఠశాలలు కావు. ఈ బళ్ళలోని విద్యార్థులందరూ వెనుకబడిన తరగతులే.

చదువులు సంగతి యిలా వుండగా, యిక ఉద్యోగాల సంగతి మరోలా వుంది.

ప్రభుత్వ స్థాయిలోను, పబ్లిక్, ప్రయివేటు రంగాలలోను 25 శాతం ఉద్యోగాలను వెనుకబడిన తరగతులకు యివ్వాలని ప్రభుత్వము 1970 లో వుత్తరువులు చేసింది. ఈ వుత్తరువులు ప్రభుత్వ స్థాయిలోనే సంతృప్తికరంగా అమలు జరగడములేదు. విద్యా సంస్థలు మేలన్న మొన్నటి వరకు ఆ వుత్తరువులను గుర్తించలేదు. జిల్లా పరిషత్తులు

* ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి సభ్యులు.

నేలేదు. ప్రభుత్వం తాలూకు
గాలావరకు ఆ వుత్తరువులను
సంస్థలూ అంతే. ఈ ల పా
మిటీలు ఎత్తి చూపినప్పటికీ,
ఈ రాష్ట్రానికి సంబంధించిన
వెను బడిన తరగతులకు ఉద్యో
ఉన్నవారంతా తిరుగుబాటు.
ంగా చాటుచుండిన రాజకీయ
త్రీయ పత్రికలు కొన్ని ఆ
.

హ్యాల్లు తరగతులు, జాతులను
ను బడిన తరగతుల విషయం

ఖ్యతులు డాక్టరు రాజేంద్ర
క్కరు గారి అధ్యక్షతను ఒక
నియమించారు. ఆ కమీషన్
ల సంక్షేమమునకై చదువుల
, వృత్తుల విషయములో
రించవలగు కార్యక్రమమును
కాని ఆ నివేదిక వెలుగులోకి
య మరొక కమీషన్ ఇటీవలనే
క కమీషన్‌లుగాని, సాయం
ం లేదు. వెనుకబడిన తరగతు
ంకలేల్కరు కమీషన్ నివేదిక
ంచి,అమలు పరచవచ్చును
పట కూడా అలాగే నివేదికలు
కమిటీలు చేసిన సిఫార్సులూ
అమలు జరపగలిగితే మరింత
బ. వాటిని పరిశీలించనప్పుడు,
కలిగే పెద్ద ప్రయోజనాలు

బడిన తరగతుల సంఖ్య 40
ష్ట్ర రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వో
లకు 40 శాతం రిజర్వేషను
ర్వేషను మరొక 20 సంవత్స
లను, ప్రమోషనులలోను
, అమలును పరిశీలించి, లోపా
మ్మత మైన అనధికారులతో–
లు - కూడిన ఒక సంఘము
పరిచే రిజర్వేషను ప్రభుత్వో
అన్ని పబ్లిక్, ప్రయివేటు
ప్రభుత్వము, పబ్లిక్, ప్రయి
మకమునకు యేర్పరచే అన్ని
తులకు ప్రాతినిధ్యం వుండాలి.

పరిమితమైన ఆదాయము కలిగిన వెనుకబడిన తర
విద్యార్థులందరికి మొదటి నుండి అవసరమైన మేరకు ప్ర
ఆర్థిక సహాయము జరగాలి. ఆ యిచ్చే ఆర్థిక సహా
స్కూలు, కాలేజీలలో జీతంకోసమేగాక, గుడ్డలు పుస్త
హాస్టలు ఖర్చులు యింకా అన్ని రకాల ఫీజులు చెల్లించడ
సరిపోవాలి. ఇందుకు అవసరమైన నిధులు కేటాయిం
కాలము వెనుకబడిన తరగతులలో విద్యా వ్యాప్తి జ
అసాధ్యము.

ఇంతకీ వెనుకబడిన తరగతులలో పదిమందికి చ
చెప్పించి, నల్గురికి ఉద్యోగాలిచ్చినంత మాత్రాన, వెను
తరగతులు పురోభివృద్ధి జెందగలరనుకోవడం సరికాదు.

ఉద్యోగాల కోసం పెరుగుచుండిన వ్యామోహ
అరికట్టటానికి అనువైన ఆర్థిక, పారిశ్రామిక విధానాన్ని
ప్రభుత్వాలు అనుసరించనంత కాలము దేశంలో పెరుగు
అసమానతలు తొలగి, సుఖ శాంతులు నెలకొనడం అసం

బలహీన వర్గాల సంక్షేమము కొరకు ప్రభుత్వాల
బడివున్నాయని పదేపదే ప్రకటించడం గమనిస్తూనే వునా
ఎవరీ బలహీన వర్గాలు ? ఆర్థికంగా వెనుకబడిన వార
బలహీన వర్గాలుగా లేదా బలహీన ప్రజలుగా మనం గు
టానికి సంసిద్ధముగా వున్న యెడల, ఉద్యోగాల నిం
ములో ఉన్నవారినందరిని వెనకపెట్టి, బలహీన వర్గాల
ప్రథమ స్థానాన్ని కల్పించవచ్చునుగదా—అందుకు ర
గము అడ్డు వస్తుందని అధికారములో వున్నవారు చెప్ప
అట్లయిన రాజ్యాంగాన్ని సవరించడము అసాధ్య
ఆ మధ్యకాలములో కుటుంబానికొకరికి ఉద్యోగం యి
న్నారు. దాన్ని అమలు జరపడములో యేర్పడిన ప్ర
కాలను అధిగమించటానికి ప్రభుత్వాలు అనుసరించిన వి
లేమిటి ?

ఈ నాడు ఉద్యోగాలలో వున్నవారి ప్రతి
విషయం వివరంగా పరిశీలించిన యెడల, లేనివారికి లేక
ఒకే కుటుంబము నుండి లేదా వారి చుట్టపక్కాల
హెచ్చు ఉద్యోగాలు ఆక్రమిస్తున్నారన్నది ఋజువవ
చివరకు రాజకీయ పదవులలో కూడా యీ విధానము
బింబిస్తూనే వుంది.

ఒకేకుటుంబములోని ఒకరు పరిశ్రమ, మరొకరు ఉ
ద్యోగం, మరొకరు రాజకీయపదవి, మరొకరు కాంట్రా
మరొకరు కమీషను ఏజంటు, యీ విధంగా దేశం
సంపద కొద్దిమంది పెట్టుబడిదారులతోపాటు, ఉన్నత పద
లేదా ఉన్నతోద్యోగాలలో వున్న మరికొందరి చే
వుండిపోయింది.

ఈ పరిస్థితికితోడు ఉద్యోగం అనగానే నికరమై
జీతం, జీతం మీద సెలవులు, విద్య, వైద్య, గృహ సౌక

రాకపోకలకు వాహన సౌకర్యములు, సరసమైనధరలకు నిత్య జీవితావసర వస్తువులు, ప్రావిడెంటు ఫండ్లు గ్రాట్యుటీలు, పెన్షనులు — యింకా ఎన్నో సౌకర్యాలు గ్రామాలలో స్వగంగా వృత్తిచేసికొని బ్రతకాలంటే ఆ వృత్తులన్నీ భారీ పరిశ్రమల స్వాధీనము కావడముతో, భార్యాబిడ్డలు అందరూ కలిపి బండచాకరీ చేసినా, చివరకు చాలీచాలని తిండితో నికృష్ట జీవనము జరుపుతూ వున్న కోట్లకొలది అభాగ్యులందరూ వెనుకబడిన తరగతులకు చెందినవారే.

ప్రభుత్వాలు చెప్పేది చేయాలి. అది జరగడములేదు. నిరుద్యోగ నివారణ తమ లక్ష్యంగా చాటుకొందిన మన ప్రభుత్వం అందుకుగాను 2 కోట్ల రూపాయలను యీ సంవత్సరము కేటాయించింది. దానితో 15 వేలమంది నిరుద్యోగులకు వృత్తులలో శిక్షణ యిస్తామని, లేదా ఏదైనా స్వయం ఉపాధి కల్పిస్తామని ప్రభుత్వము అంటూ వుంటుంది. అంతటితో నిరుద్యోగం నివారణ అవుతుందా? పెరిగి పోతున్న ఆస్థి, ఆదాయములోని అసమానతలను తొలగి పోతాయా? అందుకు నాందిగా మన ప్రభుత్వాలు చేసిందేమైనా వుందా? ఒక వంక 10 వేల రూపాయల జీతగాడు మరొక వంక వంద రూపాయల కంటెంకెంటు వర్కారా? —

కోట్లకొలది ప్రజలకు నికరమైన లాభసాటి వృత్తులు కల్పించగల శక్తి కలిగిన చేనేత పరిశ్రమ, తదితర చేతి వృత్తులను భారీ యంత్ర పరిశ్రమలకు బలి చేస్తూ, కొత్తగా వృత్తులు కల్పించ గలమని చెప్పడం వినేవారికి వెగటును కలిగిస్తున్నది.

వెనుకబడిన తరగతుల పురోభివృద్ధి సాధించటానికి, ఆర్థికంగా దిగజారి పోయిన ప్రజల పురోభివృద్ధి సాధించటానికి వారందరికి నికరమైన నెల జీతాలపై ఉద్యోగాల కల్పించాలనుకోవడం భ్రమ. దేశంలో అనాదిగా, యీ నాటికి నిలిచివున్న చేతి వృత్తులను పునరుద్ధరించి, వాటి ద్వారా వారు లాభసాటి వేతనాన్ని ఆర్జించి, సుఖంగా, సంతృప్తికరంగా బ్రతకటానికి అనువైన పరిస్థితులు కల్పించాలి. అందుకు అవసరమైన యంత్ర పరిశ్రమలను అదుపులో పెట్టాలి. అది జరగనంత వరకు యీ దేశంలో నిరుద్యోగం తొలగడం కాని, దారిద్ర్యము అంతరించడముగాని అసంభవం—వెనుకబడిన తనం తొలగడము కూడా అసంభవమే.

మరొక విన్నపము! మన వెనుకబడిన తరగతులు, లేదా పేద ప్రజలు తమ అవసరాలన్నిటినీ ఎవరో తీర్చగలరని భావించడము వెర్రితనము. మన విధులను మనం సక్రమంగా నిర్వహించ కలిగిన శక్తి సమకూర్చుకొన్నప్పుడే, మన హక్కులను సాధించుకోగలము. ఈ విషయములోనే వెనుకబడిన తరగతులు వెనుకబడి వున్నాయి.

— —

రాష్ట్రంలో

# జలజనుల ప్రగతి

మల్లాడి సా

రాష్ట్రంలో మత్స్యపరిశ్రమయే జీవనోపాధిగా కలిగిన జలజనుల ప్రగతిని కాంక్షించి—మన ప్రియతమ నాయకులు, రాష్ట్ర ముఖ్య మంత్రివర్యులు, గౌ॥ డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారు - ఈ సంవత్సరము బడ్జెట్‌లో 7 1/2 కోట్ల రూపాయలను మంజూరు గావించుట రాష్ట్రంలో మత్స్య పరిశ్రమాభివృద్ధి, జలజనుల ప్రగతిపట్ల గల ఆకాంక్షను విశదపరుచుచున్నది.

మన రాష్ట్రానికి 980 కి.మీ. కోస్తాతీరం, మత్స్య సంపదకు అనుకూలమైన ఎన్నో వనరులు వున్నవి. కోస్తాలో మత్స్యపరిశ్రమాభివృద్ధికి గాను—విశాఖ, కాకినాడలలో ఫిషింగ్ హార్బర్సును విస్తృత పరుచుటతోబాటు, కోస్తా జిల్లాలందలి భావనపాడు, నరసాపురం, మచిలీపట్నం, నిజాంపట్నం, రామయ్యా పట్నం, కృష్ణా పట్నములలో ఫిషింగ్ హార్బర్సు నిర్మాణం గావించబడాలి.

సముద్రమే తాము - తామే సముద్రమనే అవినాభావ సంబంధముతో నిరంతరం శ్రమించి జీవించే మత్స్య పారిశ్రామికులకు అధికసంఖ్యలో మత్స్య శిక్షణ నిచ్చి, విరివిగా యంత్రపు పడవలు, నావలు, తెప్పలు, నైలాను నూలు, ప్రత్తి నూలు వలలు తయారీకి తగు నిధులను మంజూరుచేసి వీటిని సబ్సిడీ పద్ధతిపై అందుబాటు గావించి, సత్వర రవాణాకు కోస్తా తీరంలో రోడ్లు, శీతల గిడ్డంగులు నెలకొల్పబడాలి.

సముద్రేతర మత్స్యపరిశ్రమపై జీవించే మత్స్యపారిశ్రామికులకు, చెఱువులు, కుంటలు, జలాశయాలు, కాలువలు, డ్రైనులు రాష్ట్రంలో ఏ శాఖకు చెందియున్ననూ వీటన్నింటినీ ఎవరివల్ల ఎటువంటి ఇబ్బందులు కలుగని పద్ధతులలో, స్థానిక మత్స్య పారిశ్రామికుల ప్రాథమిక సహకార సంఘాలకు, మత్స్య శాఖవారి నిర్ణయంతో పది సంవత్సరాలకు లీజుకి విధానాలను అమలు జరిపించాలి.

నేటి నవసమాజంలో—హరిజనులు, గిరిజనుల కంటే వెనుకబడియున్న జలజనుల సాంఘిక, సామాజిక, ఆర్థిక, న్నతికి గాను—వీరి గ్రామాలకు విద్య, వైద్య, రవ గృహావసతి, లైటింగ్, పారిశుధ్యం, మంచినీటి స వంటి కనీస సౌకర్యాలపట్ల తగు కార్యక్రమములను జరిపించి, సముద్రేతర మత్స్యపరిశ్రమకు కావలసిన చేప నములు సబ్సిడీపై సరఫరా గావించి, చెఱువుల మార్కెటింగునకు తగు రుణ సదుపాయము, ప్రాథమి కార సంఘాలకు కో-ఆపరేటివ్ బ్యాంకులలో సభ్యత్వం క్రీయ రంగాలలో వీరి ప్రతినిధులకు ప్రాతినిధ్యం కలిగిం

వీరు నివసించే గ్రామాలలో ఆశ్రమ పాఠశాలలు, జన విద్యా కేంద్రములను నెలకొల్పి, వీరి బిడ్డలకు ఉచిత భోజన వసతి, స్కాలర్ షిప్పులు, ఉద్యోగావకాశాలు క బడాలి. ఆహార సమస్యా పరిష్కారానికి, విదేశీమారక సముపార్జనకు ఆలవాలమైన మత్స్యాలను - రైల్వే, బస్సు సత్వర రవాణాకు తగు ప్రత్యేక అవకాశాలను కల్ రొయ్యలపై 5 శాతం పన్నులు విధించి అమలుజరు పూర్తిగా రద్దుపరచి, నైలాను నూలుపై సేల్సుటా బోటుల ఆయిలు యింజన్సుపై గల ఎక్సైజ్ డ్యూటీని గింపజేసి, ఉత్పత్తిని పెంచే మత్స్యపరిశ్రమను, సంపదను జలజనుల ప్రగతికి రాష్ట్రంలో వినూత్న కార్యక్రమ రూపొందింపజేయాలి. దేశ పరిశ్రమత్స్య శమలో ఆంధ్ర ప్రముఖస్థానాన్ని పొందాలి.

∽న సభ్యులు; రాష్ట్రమత్స్య పారిశ్రామికుల సమాఖ్య గౌరవాధ్యక్షులు.

# వెనుకబడిన తరగతుల అభివృద్ధి ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు

బి. శ్రీరాములు*

కొన్ని ఇతర వర్గాల ప్రజలు కూడా ఉన్నారు. కాని వారి పరిస్థితి పైన తెలిపినవారి అంత ఇబ్బందిగా లేదు. కాని వీరు సాంఘిక అన్యాయాలకు ఒకరకంగా కాకపోయినా మరొక తరహంగానైనా గురయ్యారు. వీరు కొన్ని ఇతరవర్గాల ప్రజల పొందిన పురోగతిని సాధించలేకపోయారు.

ఇతరులతోపాటు ప్రజ లందరికి న్యాయం, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సమాన హోదాను లభింపచేయడం, వ్యక్తిగత గౌరవం, జాతీయ సమైక్యతను కలుగచేస్తూ సోదర భావాన్ని వారందరిలో పెంపొందించడం మన రాజ్యాంగం ముఖ్యోద్దేశం. ఈ ఉద్దేశాన్ని అనుసరించి మరియు ప్రత్యేక సంరక్షణ అవసరమైన పైన తెలియచేసిన కొన్ని వర్గాల ప్రజల స్థితిని గుర్తించి, పైన తెలిపిన తరగతులవారి అభివృద్ధి నిమిత్తము చర్యలు తీసుకోవడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వీలు కల్పించడం కోసం మరియు ఆ వెనుకబడిన తరగతులవారి సంరక్షణ కోసం మన రాజ్యాంగంలో నిబంధన చేయవలసి వచ్చింది.

అయినప్పటికీ, స్థితికోసం పోరాటం ప్రస్తుతం అధికంగా సాగుతున్న ఈ దేశంలో ప్రభుత్వం తీసుకున్న చర్యలు, ఆక్షేపించబడుతున్నాయి. మరియు న్యాయస్థానాలచే నిలిపివుంచ బడుతున్నాయి. ఇదేవిషయం మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కూడా జరిగింది. అందువల్ల 1952, విచారణ సంఘం చట్టం క్రింద విచారణ సంఘం ఒకదానిని ఆంధ్రప్రదేశ ప్రభుత్వం నియమించింది. సాంఘికంగాను, విద్యాపరంగాను వెనుకబడిన తరగతుల జాబితాను తయారుచేయడానికి మరియు వారి విద్యా, ఆర్థిక స్థితిగతుల మెరుగుదలకోసం, విద్యాసంస్థలలో సీట్ల రిజర్వేషన్ సహాయం రూపంలో ఇవ్వబడే స్కాలర్‌షిప్పులవంటి రాయితీలు, సర్వీసులు మున్నగువాటిలో నియామకం లేక పదవుల రిజర్వేషనును ప్రత్యేకంగా పురస్కరించుకొని ప్రభుత్వంచే చేయబడే ప్రత్యేక నిబంధనలుగా సిఫారసులు చేయడానికి ఈ సంఘం నియమించబడింది. ఈ సంఘం అనంతరామన్ సంఘం అని పిలువబడేది. ఈ సంఘం తరగతి ప్రజల అన్ని దశలలోని సమస్యల సవివరమైన పరిశీలనను జరిపింది. అంతే కాక, సాంఘికంగాను, విద్యాపరంగాను వెనుకబడిన తరగతుల జాబితాను ఇది రూపొందించింది. ఇది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కొన్ని సిఫారసులను చేసింది. విద్యా సంస్థలలోను, వృత్తి విద్యాపరమైన కోర్సులలోను సీట్ల రిజర్వేషను, సర్వీసుల రిజర్వేషను వంటి ముఖ్యమైన అంశాలను సంఘం సిఫారసులలో తెలియచేయడం జరిగింది. ముఖ్యమంత్రిగారు శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి నాయకత్వం వహించినఅప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి వివిధ ముఖ్యమైన అంశాలపై సంఘం సిఫారసులను ఆమోదించడానికి వీలుకలుగలేదు. ఈ సంఘం 1970, జూను మధ్యకాలంలో తమ నివేదికను అందచేసింది. దాని ముఖ్యమైన సిఫారసులను ఆమోదిస్తూ, సంఘం సిఫారసులను పురస్కరించుకొని తీసుకోవలసిన చర్యలను ఆదేశిస్తూ 1970, సెప్టెంబరులో ప్రభుత్వం ఉత్తరువులను జారీ చేసింది.

ప్రజల సాంఘిక, విద్యాపరమైన వెనుకబడిన తనాన్ని నిర్ధారించేందుకు సంఘం సలహా ఇచ్చిన విధానాన్ని, వృత్తి విద్యా పరమైన కోర్సులలోని సీట్ల రిజర్వేషను సర్వీసులలో రిజర్వేషనుకు సంబంధించి దాని సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది. ఈ రిజర్వేషన్లు 10 సంవత్సరాలకాలం అంటే 1980-81 వరకు అమలులో ఉంటాయి. ఇంతేకాక, షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడిన తరగతులవారి పరిస్థితులను మెరుగు పరచడానికి అనేక చర్యలను ప్రభుత్వం చేపట్టింది. వారి పరిస్థితిని మెరుగుపరచడానికి ఉద్దేశించిన వివిధ చర్యలు అమలుపరచేందుకు, అమలు జరిగేటట్లు చూడడానికి ఏజెన్సీలు, వెనుకబడిన తరగతులవారి పురోభివృద్ధి కోసం ఉద్దేశించిన ఆర్థిక పథకాలకోసం ప్రత్యేక సంస్థలు ఏర్పాటువంటి చర్యలను ప్రభుత్వం చేపట్టింది. ఈ తరగతి ప్రజల అభివృద్ధికి, ఒక విధంగా వారికోసం ఉద్దేశించిన ఈ చర్యలన్ని ఎంతో సహాయ పడ్డాయి, కాని. సమాజంలోని సాధారణ పద్ధతి అవలంబించే పరిమితుల మూలంగా గాని, పెరుగుదల ప్రగతి ఇతర కారణాల మూలంగాగాని ఆశించింది జరగలేదు. ప్రజలలోని ఇంతకుముందే అభివృద్ధి చెందిన తరగతుల పరిస్థితి ఇంకను అభి

---

*చైర్మను, ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు (అప్పటి అనంతరామన్ కమీషన్ సభ్యుడు)

వృద్ధి చెందుతుండగా, అభివృద్ధి చెందని తరగతుల వారు, ఈ తేడా నిరంతరం కొనసాగుతున్న కారణంగా, ఎక్కువ అభివృద్ధిని సాధించలేక పోతున్నారు.

అంతేకాక, వెనుకబడిన తరగతులను అభివృద్ధి పరచే సమస్య విద్యా రాయితీలు లేక సర్వీసులలో ఎక్కువ ప్రాధాన్యత, పరిమితమైన వత్తిడి మాత్రమే ఉన్నటువంటివి కాక, వారి సాధారణ ఆర్థికస్థాయి, జీవన ప్రమాణాలను మెరుగుపరచాలని నేను ఆలోచించవలసినట్టి అధిక ప్రమాణం కలిగిఉన్నది. వెనుకబడిన తరగతుల జీవన ప్రమాణంలో మార్పు తీసుకురావడానికి రూపొందించిన పథకాలపై అధిక మొత్తాలను రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం ఖర్చు చేస్తున్నాయి. ప్రస్తుత సంవత్సరంలోనే, రాష్ట్ర ప్రభుత్వం రూ. 130 లక్షల అదనపు కేటాయింపులను చేసింది. ఈ మొత్తంలో వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థుల మార్జిను పైకంగా ఇవ్వడానికి వెనుకబడిన తరగతుల ఆర్థిక సహాయ సంస్థకు రూ. 60 లక్షలు ఇవ్వబడుతుంది. సుమారు రూ. 30 లక్షలు వెనుకబడిన తరగతుల విద్యార్థుల హాస్టళ్ల నిర్మాణంకోసం; సేద్యపు బావుల కోసం రూ. 40 లక్షలు కేటాయించబడ్డాయి అనేక అట్టి చర్యలను ప్రభుత్వం తీసుకుంటున్నది. వెనుకబడిన తరగతుల స్థాయిని మెరుగుపరచడానికి ప్రభుత్వం సర్వ విధాలా కృషి చేస్తున్నది.

కాని, వెనుకబడిన తరగతులకు చెందిన వీలయినంత మందికి పూర్తి మరియు ప్రయోజన దాయకమైన ఉపాధికల్పన కనుగొనడినట్లయితే, అధిక వత్తిడి చేయవలసి వీలవుతుంది. ఈ సందర్భంలో ఉపాధికల్పన అనేమాట ప్రభుత్వం లేక ఇతర ఉద్యోగుల క్రింద జీతం చెల్లించే ఉద్యోగాలనే అర్థంలో వాడబడలేదు. కుటుంబంలోని పాల్గొనే వారి మరియు సభ్యులకు సహాయపడే ఉత్పత్తిదాయకమైన ఉపాధికల్పన లేక పాత్ర వారి ఆదాయాలను పెంచడం లేక అనుబంధించడమేకాక, దేశంలోని వివిధ పదార్థాలు, సరుకుల ఉత్పత్తిని అధికం చేస్తుంది

ఈ దశలో ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు, మన రాష్ట్రంలోనేకాక, దేశమంతటా ప్రముఖ పాత్ర వహించగలదు. అది అట్టి ప్రముఖపాత్రను వహిస్తున్నది కూడా. ప్రత్యేకంగా వెనుకబడిన తరగతులకు చెందిన ప్రజలకు సహాయపడడంలో, ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషను ద్వారా కేంద్రప్రభుత్వం ఈ బోర్డుకు నిధులు లభిస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం వారి సహాయక గ్రాంట్ల ద్వారా పరిపాలించబడుతున్నది.

రాష్ట్రంలోని ఖాదీ, గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి పరచడం ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషను. రాష్ట్ర ఖాదీ బోర్డు ముఖ్య ఉద్దేశం. సంస్థలు వారి అధికార పరిధిలోఉన్న ఖాదీ లేక గ్రామీణ పరిశ్రమలలో నిమగ్నులైఉన్న వ్యక్తులకు ఆర్థిక సహాయం అందించడం వీటి ముఖ్య ఉద్దేశం. ఈ రాష్ట్రంలో, ఖాదీ పరిశ్రమలు కాక, ఈ క్రింది గ్రామీణ పరి...కు రాష్ట్ర ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు సహాయపడు

1. గ్రామీణ నూనె పరిశ్రమలు.
2. గ్రామీణ చర్మము.
3. బెల్లం ఖండసారి
4. తాటి బెల్లం.
5. ఖాద్యంకాని నూనెలో సబ్బులు.
6. పంటల ప్రాసెసింగు, ప్రిజర్వేషన్లు.
7. గ్రామీణ పింగాణి.
8. చేతితో చేసిన పేపరు.
9. నార పరిశ్రమ.
10. వడ్రంగి, కంసాలి.
11. కుటీర, అగ్గి పెట్టెలు.
12. సిమ్ము తయారీ.
13. వైద్యం నిమిత్తం అటవీ మొక్కలు.
14. తృణధాన్యాలు, పప్పు ధాన్యాల ప్రాసెసింగు
15. తేనె. బ్యాంబు.
16. గోబరు గ్యాసు మున్నగునవి.

గ్రామీణ చేతిపనివారు సంఘంగా ఏర్పడిన మరికొ పరిశ్రమలను బోర్డు అధికార పరిధిలోనికి తీసుకువచ్చే అ శాలు ఖాదీ, గ్రామీణ పరిశ్రమలతో సంప్రదింపులలో బోర్డ శీలన క్రింద ఉన్నాయి.

వికేంద్రీకరింపబడిన రంగం ద్వారా స్థానంలో సంఖ్యాకులకు ఉపాధి కల్పించడం లాభసాటి అన్న అభిప్రాయానురాను తీవ్రతరమౌతుంది. నిరుద్యోగికి పెద్ద తరహా పరిశ్రమలలో ఉద్యోగాలు కల్పించాలంటే కనీసంఒకలక్షరూపాయలైనా కావాలి, అదే గ్రామీణ పరిశ్రమలలో అయితే కేవలం నాలుగైదు వేలు పెట్టుబడి పెట్టడంతోనే ఉపాధి కల్పించ వచ్చును. కాబట్టి వెనుకబడిన తరగతులకు చెందిన వా అభివృద్ధి చేయాలంటే పల్లె ప్రాంతాలలోని చిన్న తరహా పరిశ్రమలకు కూడా ప్రాధాన్యత ఇవ్వాలి.

మన దేశంలోని జనాభాలో అధిక సంఖ్యాకులైన వెనుకబడిన తరగతులకు చెందిన వారిని అభివృద్ధిపరచడానికి గ్రామ లోని పరిశ్రమలు అన్నివిధాలా అభివృద్ధిపరచవలసి వు ఎందుచేతనంటే వెనుకబడిన వర్గాలలోని 90 శాతం మందికి పరిశ్రమలద్వారా ఉద్యోగావకాశాలు కల్పింపబడుతున్న అంతేకాకుండా వీటిలో చాలా భాగం పరిశ్రమలు, ఖా గ్రామీణ పరిశ్రమల బోర్డు పరిధిలో వున్నది.

దేశ ఆర్థిక పునర్ నిర్మాణం కోసం రచింపబడే ఏ ప్రణాళికలోనైనా, వెనుకబడిన తరగతులవారి శీఘ్రతర అభ్యున్నతి కోసం తీసుకోవలసిన చర్యలను చేర్చడం ఎంతయినా అవసరం. ఈ వర్గాలవారు తమంతకు తాము అభివృద్ధిపరచడానికి దోహదకారికాగల పరిస్థితులు వారికి మనం కల్పించాలి. వెనుకబ

తరగతులకు చెందిన చాలా మంది సంప్రదాయక వంశపారం పర్యం వృత్తుల ద్వారా జీవనోపాధిని కలిగివున్నారు. ఈ అధ ర్మాలకు చెందినవారిలో చాలామంది గృహ సంబంధమైన వస్తువులు తయారుచేసే పరిశ్రమలలోనూ పనిచేస్తూ, ఉన్నతస్థాయి పనితనాన్ని కలిగివున్నారు. సంప్రదాయక, గృహ సంబంధ పరిశ్రమలలోనూ హస్తకళా పరిశ్రమల ద్వారా ఈ వర్గాల వారు తమ భుక్తిని గడించుకొంటున్నారు. మిల్లులలో పోటీ పడటంమూలంగాను, యంత్రాల సహాయంతో తయారయిన వస్తువులు ఒరివిగాను, చౌకగా మార్కెట్లలో దొరుకుటచేతను. ఒకనాడు అత్యున్నత స్థాయిలో విరాజిల్లిన గ్రామీణ పరిశ్రమలు ఈ పోటీని తట్టుకొనలేక క్రమక్రమంగా క్షీణిస్తున్నాయి. దీనిమూలంగా వృత్తి కళాకారులు తమతమ వృత్తులను వదులుకోవటంచేత, వంశపారంపర్యంగా వచ్చే ప్రావీణ్యాన్ని కోల్పోయి, నైపుణ్యం లేని కూలీలుగా పరిగణించబడుతున్నారు. వీరిలో కొంతమంది సేద్యాన్ని చేపట్టారు. మరి కొందరు అప్పుడప్పుడు కూలీలు చేసుకుంటూ జీవిస్తున్నారు. కొంతమంది ఉపాధిని వెదుక్కొంటూ పట్టణాలు చేరుకొంటున్నారు. ఇలా ఈ వృత్తికారులు రకరకాల బాధలకు యిడుములకు గురి అవుతున్నారు. సంప్రదాయకవృత్తులు లాభసాటిగా వుండనప్పటికి కొందరు అనేక వృత్తులను అంటిపెట్టుకొని వుండటంచేత చాలా ఇక్కట్లు పడుతున్నారు. వారి వద్ద పెట్టుబడిలేదు, చేసిన వస్తువులు అమ్ముకోవడానికి తగిన వ్యాపార సదుపాయాలు లేవు. ముడి వస్తువులు తీసుకొని రావడంతో కూడా చాలా కష్టాలు ఎదురౌతున్నవి. వృత్తి పన్ను, లైసెన్సు రుసుములు, అమ్మకం పన్ను ఇతర పన్నులు ఈ వృత్తికారులు చెల్లించవలసి వున్నందున వారిపై పన్నుల భారం అంతకంతకు పెరుగుతున్నది. ప్రభుత్వం సమకూర్చే సేవలు, ఈ వెనుకబడిన తరగతులకు చెందిన వారిలో ఒక భాగమైన విద్యావంతులకుకూడా అందటంలేదు.

13. కాబట్టి గ్రామీణ ప్రాంతాలలోని వెనుకబడిన తరగతులకు చెందిన వారిని శీఘ్రంగా అభివృద్ధి చేయడానికి ముఖ్యమైన పరిష్కారమార్గం ఏమిటంటే, త్వరితగతిలో క్షీణిస్తున్న గ్రామీణ పరిశ్రమలు హస్తకళ నైపుణ్యంకల పరిశ్రమలను పునరుద్ధరించడానికి దోహదం చేకూర్చే పరిస్థితులను సమకూర్చడం ద్వారా వీరి పురోభివృద్ధికి చేయూతనివ్వాలి. తద్వారా ఉపాధి అవకాశాలను మెరుగుపరచడానికి వీలుంటుంది. కాబట్టి గ్రామీణ హస్తకళా నైపుణ్యంగల పరిశ్రమలను తిరిగి దేశంలో వుద్ధరించడానికి ఉద్దేశించిన పథకానికి ప్రభుత్వం ప్రత్యేకమైన ప్రాధాన్యతను యివ్వాలి. నగదు సబ్సిడీలను, వడ్డీ లేని రుణాలు, అధునాతన యంత్రాలను, పరికరాలను, ఉపకరణాలు ఉచితంగా సరఫరా చేయడం తయారయిన వస్తువులు అమ్మడానికి వసతులు కల్పించడం, వృత్తికారుల సహకార సంఘాలకు సహాయక గ్రాంట్లను యివ్వడం ద్వారా ఈ పథకాలను అమలుపరిచేవారికి ప్రభుత్వం చేయూత నివ్వాలి. వివిధ హస్తకళ నైపుణ్యం వున్న వృత్తులలో శిక్షణ యివ్వడానికి ఈ వృత్తి కళాకారులకు శిక్షణా కేంద్రాలను తెరవాలి. మిల్లుల నుండి ఏర్పడుతున్న అనారోగ్యకరమైన స్పర్థను తట్టుకోవడానికి గాను గ్రామీణ పరిశ్రమల రంగానికి శిక్షణ కల్పించాలి. అయితే, గ్రామీణ పరిశ్రమల క్షీణతకు కారణమౌతున్న మిల్లులను మూసివేయాలనేది నా అభిమతం కాదు నా సూచన ఏమంటే ఏ ఏరంగం పరిశ్రమలు ఏ ఏ వస్తువులను తయారు చేయాలనేది స్పష్టంగా పేర్కొనాలి అలా పేర్కొన్న వస్తువులను ఆయా రంగానికి చెందిన పరిశ్రమలే తయారు చేయాలి. గిరాకిని జాగ్రత్తగా మదింపుచేసిన తరువాత ఈ కేటాయింపులు జరగాలి. అవసరమయితే, ఉత్పాదక స్థాయిలోనే అవసరమైన మార్పులను చేరుపులను చేయటానికి వీలుండాలి. ప్రభుత్వశాఖలు, ఈ గ్రామీణ పరిశ్రమల ద్వారా ఉత్పత్తి అయ్యే వస్తువులను సంపూర్తిగా ఉపయోగించాలి. గ్రామీణ పరిశ్రమలకు హస్తకళా పరిశ్రమలకు హానికలగని విధంగా గ్రామీణ ప్రాంతాలలో పరిశ్రమను స్థాపించడం ద్వారా కొత్తగా ఉపాధి అవకాశాలను కల్పించాలి. నిరుద్యోగ సమస్య ఎక్కువగా ఈ తరుణంలో ఈ సమస్యను పరిష్కరించాడానికి ప్రభుత్వానికి సాధ్యంకాకపోవచ్చు.

14. మన దేశపు జనాభాలో అధిక సంఖ్యాకులు సామాన్యులు, వీరిలో చాలాభాగం వెనుకబడిన తరగతులకు బలహీన వర్గాలకు చెందినవారే. వీరి అభ్యున్నతి కోసం ఖాదీ, గ్రామీణ పరిశ్రమల రంగం అభివృద్ధి చెందాలనేది పైన పేర్కొన అంశాల వల్ల విదిత మౌతుంది.

15. ఆంధ్రప్రదేశ ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి, వెనుకబడిన తరగతులకు చెందిన గ్రామీణ వృత్తికారులకు సహాయం చేయడంలో తన శక్తిమేరా కృషి చేస్తున్నది. సెక్యూరిటీల విషయంలోనూ, పూచీలు మొదలగు వాటి విషయంలోనూ కొన్ని సడలింపులను గ్రామీణ వృత్తికారులకు కల్పించడం ద్వారా వీరికి కేటాయింపులు సులభంగా అందేటట్లు ఈ మండలి చూస్తున్నది. గత రెండేండ్లలోను మండలి నేరుగాను, బ్యాంకుల ద్వారాను దాదాపు 30 వేల మందికి ఆర్థిక సహాయం అందజేసింది వీరిలో దాదాపు నూటికి నూరు పాళ్లు, వడ్రంగులు కమ్మరులు, కుమ్మర్లు, చెప్పులుకుట్టే వాళ్లు, తోళ్లుపదను చేసే వాళ్లు (హరిజనులు) వంటి వృత్తులు అవలంబించే వెనుకబడిన తరగతులకు, బలహీన వర్గాలకు మెజార్టీలు కులాలు, జాతులకు చెందినవారే. అయినప్పటికి తోడ్పాటు అవసరం వున్న వృత్తికారులు దేశంలో లక్షలాదిగా వున్నారు. వీరికి పైకాలు సమకూర్చడం ద్వారా ఉపాధి కల్పించడమే కాకుండా ఆదాయాలను మెరుగుపరుచుకోవడానికి వారికి తోడ్పడాలి.

వెనుకబడిన తరగతులకు చెందినవారి సమస్యలను తీర్చడానికి ఒక నియమితమైన సూత్రం ఏదీలేదు. వివిధ అంశాలను సమన్వయించుకొని నిలకడగా పని చేసుకొని పోతే కొన్నేళ్లకయినా ఆశించిన ఫలితాలను పొందవచ్చును. అన్నిటికన్న ముఖ్యమైనది. వీళ్లు మన సహోదరులే అన్నభావనతో ఈ

సమస్యను ఎదుర్కోవాలి. ఇట్టి సౌభ్రాతృత్వ భావనతో సమాజంలోని అదృష్టవంతులైన అభివృద్ధి చెందిన వర్గాల వారు కృషిచేస్తే ఎన్నో అద్భుతాలను సాధించవచ్చు. ఒకరినొకరు అర్థం చేసుకొని కలిసిమెలసి వుండే రోజుల కోసం ఎదురు చూద్దాం. ప్రస్తుతం ప్రభుత్వం వెనుకబడిన తరగతుల వారికి కల్పిస్తున్న విద్యా విషయిక రాయితీలు ఉద్యోగాలలో రిజర్వేషన్లు మున్నగు సదుపాయాలను మరో పదెళ్ల వరకు పొడిగించాలని మరిన్ని అదనపు సౌకర్యాలు కల్పించాలని ఈ వర్గాల అభ్యున్నతికోసం కృషి చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మన ప్రియతమ ముఖ్యమంత్రి గారి సుదృధ నాయకత్వం క్రింద ఇప్పటి ప్రభుత్వం, వెనుకబడిన తరగతులు బలహీన వర్గాల వారి పురోభివృద్ధికి అవసరమైన అన్ని చర్యలను తీసుకొంటుందని వారి అభ్యుదయానికి నిర్మాణాత్మక మార్గంలో కృషి చేయగలదని నేను దృఢంగా నమ్ముతున్నాను.

ఇప్పటి వరకు తీసుకొన్న వివిధ రకాల చర్యలవల్ల గ్రామీణ ప్రాంతాలలోని వృత్తి కళాకారులు కొద్దిగానే ప్రయోజన పొందారు. వృత్తికారుడు తన వృత్తిలో నిలదొక్కుకోవాలంటే విధానంలో తోడ్పాటు ఇవ్వాలి అంటే వీరికి సరసంగాను, చవకగాను ముడి సరుకులు లభ్యం చేయడం మార్కెటింగు సదుపాయాలు కల్పించడం లైసెన్సు రుసుములు మునిసిపాలిటీ అనుమతులు మున్నగు నిజంగా అవసరం లేని లాంఛనాలను రద్దు చేయడం వంటి విధాన పూర్వకమైన రాయితీలను కల్పించాలి.

ఈ సమస్యకు తగిన పరిష్కారం సిద్ధంగా లేదు. పైన పేర్కొన్న వివిధ అంశాలను సమన్వయ పరచడం ద్వారా కృషి సల్పితే ఈ విషయంలో అనుకొన్న ఫలితాలను సాధించవచ్చు.

---

నిజాంపాలనలో

# వెనుకబడిన తరగతుల స్థితిగతులు

మాటేటి రామప్ప*

నిజాం పాలనలో ప్రజలందరికీ తెలిసిన వర్గాలు రెండే. ఒకటి–హిందువులు; రెండు–మహమ్మదీయులు. పాలక వర్గము మహమ్మదీయులైనా చక్కగా విద్య నభ్యసించి ఉత్తమ ప్రతిభను ప్రదర్శించిన హిందూ విద్యార్థులకు సహితము ఉన్నత ఉద్యోగములు లభించు చుండెను. పాలక వర్గ ప్రతిపత్తికి విచ్ఛేదకరముగా ప్రజలు ప్రవర్తించకూడదు. ఆ మాత్రము లేకున్న చాలు, అన్ని విధాల మన్ననలూ ఉపలభ్యములే. కాని ఈ విద్య, ఉద్యోగము, మన్నన నంటివి హిందువులలో కూడా కేవలము అగ్ర తరగతుల వారికీ, భూస్వామ్య వర్గాల వారికీ మాత్రము పరిమితమై ఉండుట సామాన్యం. ఆ నాటి వెట్టి వ్యవస్థకు అత్యధిక శాతము వెనుకబడిన వర్గాలవారు బలిఅయి పోవుచుండిరి. నాటి పాలకులు సామాజికంగా విధించిన షరతులకు, నాటి సమాజ వ్యవస్థకు తట్టుకొని ఏ పేద బడుగు వర్గాలకు చెందిన బాలుడైనా ఉన్నత అవకాశాలను పొందడము బహు అపూర్వము. మిక్కిలి కష్ట సాధ్యము. ఆ విద్యార్థికి చక్కని ప్రతిభాపాటవములున్న కాని, మీదుమిక్కిలి దైవకృపచే ఏ గౌరవ కుటుంబీకులో ఆశ్రయమిచ్చిన కాని, అట్టి అవకాశము లభ్యమయ్యేడిది గాదు. నాటి స్థితిగతులకు ప్రాయశః నా జీవితమూ, స్వీయానుభవములూ చక్కటి దర్పణములను కొందును. కనుకనే కొంత ఆత్మాశ్రయముగా ఈ వ్యాసమును నడిపింతును. సహృదయులు మన్నింతురని భావింతును.

నేను 1916లో వరంగల్లులో జన్మించినాను. నాకు ప్రపంచ జ్ఞానము వచ్చిన వెంటనే, అర్థమయిన మొదటి విషయం–అధికారంలో పెద్ద ఉద్యోగములలో, పదవులలో మహమ్మదీయులు ఉండిరనుట. వారి పిమ్మట, వెనుకటి ఆసఫ్ జాహి కుటుంబముతో వచ్చిన కాయస్థులనెడి హిందువులు కొద్దిమంది ఉన్నత పదవులలో ఉండిరి. చిన్న పదవులలో బ్రాహ్మణులూ, పటేల్, పట్వారీలూ. ఈ పటేల్, పట్వారీలందరూ సామాన్యముగా బ్రాహ్మణులు, లేదా, రెడ్లు. ఇదీ ఆనాటి స్థితి. ఈ పరిస్థితిలో వెనుకబడిన తరగతుల వారి గురించి ప్రత్యేకముగా చెప్ప నక్కర లేదు.

ఈ రోజు వెనుకబడిన తరగతుల వారు అని పిలువబడే భిన్న కులాల వారందరూ చాలా వెనుకబడి ఉండిరి. వాస్తవమున వీరికీ, హరిజనులకూ ఎటువంటి తేడా కూడ లేకుండెను. ఈ రెండు వర్గాల వారిదీ ఒకే స్థితి. ఒకరికి బాహ్య అస్పృశ్యత పీడించెడిది. ఇంకొకరికి భావ అస్పృశ్యత పీడించెడిది. రెండవ అస్పృశ్యత ముంగిట మొదటిది అంత వివశతతో కనిపించెడిది కాదు. కనుక ఈ రెండు వర్గాల వారూ ఒకే స్థాయిలో ఉండిరి. సామాజికముగా కాని, ఉద్యోగ పరముగా కాని వీరికెట్టి ప్రోత్సాహములూ లేకుండెను. సమాజములో వారికి తెలిసిన అంశము–వెట్టి అనునది. స్థానిక అధికారులకు, ప్రభువులనిపించుకొను భూస్వాములకు ఉచితముగా పని చేయుచు, వారి దయా ధర్మములపై జీవించుట. గ్రామానికి ఏ పెద్ద అధికారి వచ్చినా, ఈ వెనుకబడిన కులాల వారూ, హరిజనులూ ఉచితముగా పనిపాటులు చేయుటకు బద్ధులై ఉండవలసినదే.

రెడ్డి కులస్థుల సంక్షేమ నిమిత్తము, రాజా బహద్దూర్ వెంకట్రామారెడ్డిగారి ప్రోత్సాహమున ఒక రెడ్డి సమాజము రూపుగొన్నది, రెడ్డి విద్యార్థుల కొరకు ఒక వసతి గృహమును నిర్మించినది. అప్పుడు వారు ప్రభుత్వ ఉద్యోగములో సిటీ కమీషనర్‌గా పని చేయుచుండిరి. ఆ నాడు వారి ఆధ్వర్యములో నిర్మితమైన వసతి గృహము నేటికిని ఆబిడ్స్ ప్రాంతములో నుండి, వందలాది విద్యార్థులకు ఆశ్రయమును కల్పించుచున్నది. ఆ వసతి గృహం మూలమున ఎందరో రెడ్డి విద్యార్థులు, విశేషించి ఆర్థికముగా వెనుకబడిన రెడ్డి విద్యార్థులు పైకి వచ్చినారు. బ్రాహ్మణేతరులలో సామాన్యముగా అక్షరాస్యత అరుదు. అట్టి స్థితిలో మిగిలిన వారిలో రెడ్డి, వెలమ వర్గాలవారు

* అంతర్జాతీయ తెలుగు సంస్థ నిర్దేశకులు, హైదరాబాదు.

కొంతకు కొంతయినా విద్యా రంగంలో పైకి వచ్చుటకు ఇట్టి సంక్షేమ కార్యక్రమములు ప్రధాన పాత్ర వహించినవి. ఇట్టి సంక్షేమ కార్యక్రమములు మిగిలిన వర్గముల వారికి విశేషించి వెనుకబడిన తరగతుల వారికి దాదాపు మృగ్యమనే చెప్పవలెను

ఆదే కాలములో ఉస్మానలీ పాషా, నిజాం VII, ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపన సంబంధంగా ఒక బృహత్ప్రణాళికను చేపట్టి, స్నాతకోత్తర స్థాయివరకు ఉర్దూ భాషలో శిక్షణావకాశములను ఏర్పరచినాడు. నాటికి హైదరాబాదు నగరమున మాత్రము బషీర్ బాగ్ లో 'నిజాం కళాశాల' వెలసియుండెను. ఆ కళాశాల ప్రథమాచార్యుడు భారత కోకిల సరోజినిదేవి గారి తండ్రి శ్రీ ఛటోపాధ్యాయగారు, నిజాం కళాశాలలో ఆంగ్లము బోధనాభాష, కాని అందు ప్రవేశము సామాన్యులకు కేవలము దుర్లభము. హైదరాబాదు నవాబు పిల్లలకు మాత్రమే ఆ కళాశాల ప్రత్యేకముగా వెలసియుండెను ప్రథమ దశలో అందులో అన్యులకు సీటు దొరుకుటకు చాలా నిబంధనలుండెను. హిందువులెవరయిన వచ్చినచో వారు గౌరవనీయ కుటుంబీకులమని ఒక సర్టిఫికెట్ మొట్టమొదటగా చూపించవలె. ఇట్టి సందర్భములో వెలసిన ఉస్మానియా విశ్వవిద్యాలయమున అందరికి ప్రవేశము లభింపసాగెను. కాని బోధన భాష ఉర్దూ, ఇంగ్లీషును రెండవ భాషగా మాత్రమే బోధించుచుండిరి. తెలుగునకు చెప్పదగిన స్థానమే లేకుండెను. కనీసమొక ఆచార్య స్థానమైన లేకుండెను. స్థాపనానంతరము 25 సంవత్సరాల పిమ్మట తొలిసారిగా రాయప్రోలు వారు ఆచార్యులుగా నియుక్తులయిరి.

ఆ దినాలలో తాలూకాస్థాయిలో ప్రతి తాలూకాకు ఒక ప్రాథమిక పాఠశాల లేదా మాధ్యమిక పాఠశాల ఉండెడిది. జిలా స్థాయిలో ఒక ఉన్నత పాఠశాల. సుభా స్థాయిలో ( మూడు, నాలుగు జిల్లాలు ఒక సుభా )ఒక ఇంటర్మీడియెట్ కళాశాల ఉండెడిని. వీటన్నిటిలోను బోధనభాష ఉర్దూయే. హిందూ పిల్లలకు నాల్గవ తరగతి వరకు మాత్రమే తెలుగు బోధనా భాషగా ఉండెను.

పల్లెటూళ్ళలో పాఠశాలల ప్రసక్తియేలేదు. అందువలన తాలూకా కేంద్రమునకు పంపి పిల్లలను చదివించెడి శక్తిగాని ఇచ్ఛకాని సామాన్యులకుండెడిది కాదు. ఏ పటేల్, పట్వారీల పిల్లలో కొంత చదువుచుండెడివారు. ఈ పరిస్థితిలో తరతరాలనుండి వచ్చిన ఆర్థికమైన వెనుకబడిన తనాన్ని, విద్యాలంగానయిన పోగొట్టుకొనే అవకాశం మిగిలిన వారికి లేక రి.

ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఎక్కువ మందిని ఆకర్షించుటకు ప్రభుత్వమువారు కొన్ని ప్రోత్సాహకరమైన ఏర్పాట్లు, అవకాశాలు కల్పించారు; మొదటిది-అందులో చదువుకొనుటకు ఖర్చు తక్కువ. రెండవది ఉద్యోగావకాశాలు బి. ఏ., బి యస్సీలలో ప్రథమునిగా ఉత్తీర్ణుడైన విద్యార్థికి నేరుగా గెజిటెడ్ ఉద్యోగము ఇచ్చెడివారు, ఇంజనీరింగులో ప్రథముడిగా వచ్చిన వారికి నేరుగా అసిస్టెంట్ ఇంజనీర్ పదవిని ఇచ్చెడివారు. వైద్య కళాశాలలో ప్రథమ గౌరవం పొందినవారికి లండన్ స్కాలర్ షిప్ ఇచ్చి ఎమ్. ఆర్. సి. పి. లేదా ఎఫ్. ఆర్. సి. ఎస్. కు పంపెడివారు. చిన్న స్థాయి నుండి ఇటువంటి ఉపకార వేతనాలు, ప్రోత్సాహక అవకాశాలు కల్పించుటవలన తెలివి తేటలు కలిగి చదువుకొనగోరు వారికి కొంతవరకు చక్కటి అవకాశమే ఉండెడిది. కాని వీనిని ఉపయోగ పెట్టుకొనుటయే కష్టము—మొదట చదువులకు పంపుటకు పెద్దలకుసావకాశము కాని ధైర్యముకాని ఉండేవి కావు. వారు పంపినను, తన వారసత్వమున లేని విద్యా వాతావరణములో ఇమిడి, చదువును ఒంట బట్టించుకొను శక్తి సామర్థ్యములు పిల్లలకు అరుదు. కనుక ఇంత చక్కటి అవకాశాలు కూడా కేవలము మెరిట్ మీద ఆధారపడిన మూలమున వెనుకబడిన వర్గముల వారికి అందుబాటులో లేకపోయినవి. ఏకొద్ది మందో పైకి రాగలిగిరి. ఆ కొద్దిమంది కూడా ఎన్నో కఠిన నిబంధనలను ఎదుర్కొని దైవవశమున పైకి వచ్చినవారే, అందుకు నా జీవితమే ఒక ప్రత్యక్ష తార్కాణము.

మా తండ్రిగారు నా చిన్న తనముననే గతించిరి. తరువాత, మా అమ్మమ్మ గృహమున పరకాలలో పెరుగుచుంటిని. ఎక్కువ భాగము బ్రాహ్మణబాలురతో కలసి ఆడుకొనుచుంటిని. పరకాల తాలూకా కేంద్రమగుట, నాకు విద్యా రంగములో ప్రవేశమున్న కుటుంబీకుల సహవాస మబ్బుట దైవయోగము. తత్ఫలమున నేనును బడికి పోవుట ప్రారంభించితిని. 4వ తరగతి వరకు తెలుగులోనూ, 7వ తరగతివరకు ఉర్దూలోనూ చదివితిని. 7వ తరగతిలో ప్రథమునిగా ఉత్తీర్ణుడ నైనందున, ప్రభుత్వమువారు నెలకు 10 రూపాయల ఉపకార వేతనమును మంజూరు చేసిరి. తరువాత హనుమకొండ ఉన్నత పాఠశాలలో చేరితిని. అచ్చట ఆంగ్లము బోధనా భాష. హనుమకొండ సుభా కేంద్రము కనుక అచ్చటమాత్రము ఆంగ్ల బోధన పాఠశాల ఉండెను. అదృష్టవశమున మెట్రిక్యులేషన్ లో గణితమున రాష్ట్రమునకంతటికి ప్రథమునిగా వచ్చినందున నాకు 15 రూపాయల

ఉపకార వేతనము లభ్యమయ్యెను. కాని నాకు హైదరాబాదు నగరమున నిజామ్ కళాశాలలో చదువు అవకాశము మాత్రం లేదు. ఆర్థికస్థితి మాత్రమే కారణము కాదు. గౌరవనీయ కుటుంబీకులకు మాత్రమే అచ్చట సీటు లభించుననుట ప్రధాన కారణము. కనుక ఉర్దూ భాషలోనే హనుమకొండలో ఇంటర్మీడియెట్ కొనసాగించితిని. పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయములో బి.ఏ. చేరితిని. ప్రథమునిగా వచ్చినందున 30 రూపాయల ఉపకార వేతనము లభ్యమౌచుండెను. పరమేశ్వరుని కృపచే మరల ప్రథమునిగా నెగ్గుట, ఎమ్.ఏ. లో సీటు దొరుకుట జరిగినది. అప్పుడు 60 శాతమునకు లోపు మార్కులు ఉన్నచో ఎమ్.ఏ.లో సీటు దొరికేదికాదు. ఎమ్.ఏ.లో ఇద్దరమే విద్యార్థులము. ఎమ్.ఏ. చివరి సంవత్సరములో ఉండగనే నేరుగా గెజిటెడ్ తహసీల్దారుగా ఉద్యోగము వచ్చినది. ఈ నా సుదీర్ఘ విద్యార్థి కథ వెనుక, వెనుకబడిన తరగతులకు ఎట్టి అవకాశములు నాడుండినవో వేరుగా చెప్ప నవసరములేకనే చెప్పినట్లయినదనుకొందును.

కాని ఉద్యోగములో చేరుటకు ఒక పెద్ద ప్రభంజనము వంటి నిబంధనను తట్టుకొనవలసి వచ్చినది. గౌరవనీయ కుటుంబీకులకే గెజిటెడ్ ఉద్యోగము అని ఒక నిబంధన ఉండెడిది. స్వయం ప్రతిభతో ఏదో ఒకవిధమున చదువుకొని పైకివచ్చిన చాలదు. ఉద్యోగమువచ్చు సమయమునకైన ఈ 'గౌరవనీయ' అఘాతమును తప్పించుకొనలేము. నాటి సమాజమున గౌరవనీయు లనబడు హిందువు లెవ్వరో వేరుగా చెప్పనక్కరలేదు. అదృష్టమున నాకు ప్రసిద్ధులైన రాజవైద్య హకీం నారాయణ దాసుగారు స్వకులస్థులై ఉండుట, వారితో దూరపు బాంధవ్యవుముడి నాకు లభ్యమగుట, వారు దయతో నన్ను సొంతఅల్లుడని పేర్కొని ఒక సర్టిఫికేటు నొసంగుటవలన, పరమేశ్వరుని కృపచే ఆ ఉద్యోగము చేతికి దక్కెను. నాటికి కడు కొద్దిమంది రెడ్డి కులమునకు చెందినవారు మాత్రము ఏదో ఒక పెద్ద రెడ్డి జమీందారుగారి పేరును చెప్పుకొని ఉద్యోగమున చేరినారు. అన్యులు అతి అపురూపము. సర్వవిధముల వెనుకబడిన తరగతికి చెందిన వారు విశ్వవిద్యాలయాల విద్యను అభ్యసించుటయే బహు కష్టము.

ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూర్‌లో నా తొలి ఉద్యోగ జీవితము. "ఒక సాలెవాడేమిటి ? ఇంత పెద్ద ఉద్యోగమేమిటి ? ఇది ఏమి వింత" అని కొందరు ఆశ్చర్యపడగా" ఇది ఉచితము కాదని" కొందరు తిరస్కరించిరి. ఉదార స్వభావులైన కొందరు రెడ్లు, బ్రాహ్మణులు, జమీందారులైనవారు నా పక్షమున నిలిచి "హిందువులకు పెద్ద ఉద్యోగములు దొరకుటే కష్టము. మనలో మనకు ఇట్టిచూపు తగదని" హెచ్చరించి, నాకు మిక్కిలి సహాయపడిరి. నాకన్న 5 సం.ల మునుపు శ్రీ కొమరయ్యగారు నేరుగా మునిసిఫ్‌గా నియామకము పొంది ఉండిరి. వారు కుమ్మరి కులము వారగుటచే, వారు పొందిన ప్రతిఘటన ఇంకను కష్టతరము. న్యాయవిద్యలో వారు గొప్ప ప్రవీణులు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి స్థానమువరకు వారు పురోగమించగలిగారు. నాడు వెనుకబడిన తరగతుల నుండి వచ్చి, ప్రభుత్వోద్యోగమును పొందినవారిలో, శ్రీ కొమరయ్యగారు రత్నదీపము వంటివారు. వారివలె వెనుకబడిన తరగతుల (దర్జీ కులము) నుండి వచ్చి ఉన్నత పదవిని పొందిన వారు శ్రీ దుర్గయ్యగారు. వీరు తమ కార్యదక్షతతో, లోకజ్ఞానముతో అందరి మెప్పును పొందిరి. తహసీల్దారునుంచి కలెక్టరు వరకు వచ్చిరి. ఆ కాలమునకు వెనుకబడిన తరగతులకు చెందినవారిలో ఏ పది, పదునైదు మంది మాత్రమే ప్రభుత్వాధికారులుండిరి. మావంటి నలుగురైదుగురు పొందిన ఉన్నత స్థానములు, ఎక్కువమంది వెనుకబడిన తరగతుల వారిని విద్య వైపు ఆకర్షింప కలిగినవి. కాని అనేక ఘట్టములలో మరల వారి పాలిట 'గౌరవనీయత' దాపురించెడిది. మాలో మేము, ఏ బీద పిల్లవాడినయినా, అల్లుడని వ్రాసి ఆ అడ్డునుంచి తప్పించెడి వారము. అప్పటి మహమ్మదీయ అధికారులకు ఎవరిది ఏ కులమో తెలిసెడిది కాదు. గౌరవనీయతకు సంబంధించిన సర్టిఫికేటును చూపకుంటె ఉద్యోగము దొరకుట కష్టము. నేను స్వయముగా ఏ 50 మందినో అల్లుళ్ళగా పేర్కొని ఉందును. ఆ నామక అల్లుళ్ళలో వెనుకబడిన తరగతులకు చెందిన అన్ని తెగలవారూ ఉన్నారు. గౌరవనీయత ముఖ్యంగా వెనుకబడిన తరగతుల వారి సమస్యే కదా !

నిజాం పాలనలో తెలంగాణా, మరాఠ్వాడా, కర్ణాటక అనే మూడు ప్రాంతములుండెను. ఉద్యోగపరముగా, నాకు ఈ మూడు ప్రాంతముల స్థితిగతులు కూడా ప్రత్యక్ష అనుభవమునకు వచ్చెను. ఈ మూడు ప్రాంతములందును వెనుకబడిన తరగతుల వారి సామాజిక-ఆర్థిక-దుస్థితి ఇంచు మించు ఒకే తీరుగా ఉండెను. కొంత వివరముగా చూసినచో తెలంగాణాలోని వెనుకబడిన వారి స్థితియే కొంతకు కొంత మెరుగు. మావలె ఏ కొద్దిమందయినా, సహవాసఫలమునగాని, దైవయోగమునగాని, చదువులకెగబ్రాకి ప్రభుత్వోద్యోగముల

పొంది కొంచెంత సుఖజీవనము నందగలిగిరి. మహారాష్ట్రలో పటేల్, పట్వారీ పిల్లలకు తప్ప ఇతరులకు విద్యావకాశములు చాలా అరుదు. ఉద్యోగములలో కూడా 10% గెజిటెడ్ ఉద్యోగాలు మాత్రము హిందువులకు. అందులో సగము ఉత్తరప్రదేశ్‌కు చెందిన కాయస్థ హిందువులు. మిగిలిన సగము అగ్రజాతులు. వెనుకబడిన వర్గాల వారు బహు సకృత్తు. పోలీసుచర్య పిమ్మట హైదరాబాదు నగర కమీషనర్‌గా వచ్చిన మొట్టమొదటి హిందువును నేనే. వెనుకబడిన తరగతికి చెందిన మొదటి కమీషనరును కూడా నేనే అనుట పునరుక్తి.

పోలీసు చర్య పిమ్మట ఒక విప్లవాత్మక చైతన్యం ఈ వెనుకబడిన తరగతులవారిలో వచ్చినది. అంతకు మునుపటి నుండి వెట్టి వ్యవస్థ ఉచ్చులో నుండి బయట పడి, కనీసము కులవృత్తి అయినా చేసికొని గౌరవ జీవనము గడుపవలెననెడి పట్టుదల, ప్రయత్నము ఈ కాలమున వాస్తవ ఆచరణమున సంతృప్తికరమైన ఫలితముల నిచ్చినది. చదువులలో కూడా ఆసక్తి పెరిగినది. కీ. శే. శ్రీ కె. వి. రంగారెడ్డిగారు, శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు చాలవరకు వెనుకబడిన తరగతుల వారిని ప్రోత్సహించినారు. అప్పుడు పెద్ద ఉద్యోగముల నివ్వదలచుకొన్నను, తగిన అభ్యర్థులే ఈ వర్గము నుండి దొరకకుండిరి.

పోలీసు చర్య అనంతరం ఈ 30 సంవత్సరముల కాలములో గణనీయమైన మార్పులు వచ్చినవి. ప్రభుత్వము వెనుకబడిన తరగతుల వారికి ప్రత్యేక సదుపాయముల కల్పి ప్రోత్సహించుచున్నది. రిజర్వేషన్లను ప్రవేశపెట్టినది. రిజర్వేషన్లు కొంతవరకు తప్పదు. తరతరాలుగా విద్యాపర సంస్కృతి పాదుచేసుకొన్న కుటుంబములవారితో సమానము ఈ వెనుకబడిన తరగతుల వారు పోటీ చేసి విజయమ సాధించుట కష్టతరము పిల్లలకంటె ముందుగా పెద్ద విద్యా సంస్కృతి విశదముగా తెలియదు. సంస్కృతి అను ఒక విధముగా చూసిన సుప్తవాసనా విశేషమే. అది స చిత్తమున వెలిగి, చోటు చేసికొనిన కాని, వ్యక్తి చైతన్యమ సత్ఫలితముల నియ్యజాలదు. ఈ సంస్కృతి చైతన్యము ఒక నాటితో అలవడునెడిది కాదు. అది నెమ్మది నెమ్మదిగా పూ వికసనమందువరకు ఈ రిజర్వేషన్లను కొనసాగించవలసి ఉన్న కాని ఇటీవల కొందరు పిల్లలు ఈ రిజర్వేషన్లపై పేర పెట్టుకొని, తమ తెలివి తేటలను వ్యర్థపరచుకొని, సరిగా వి నభ్యసించుట లేదు. ఇది మొదటికే మోసముగా నున్న ఈ పరిస్థితిని చక్కదిద్దు సామర్థ్యము ఒక్క వారి తల్లిదండ్ర పైననే ఉన్నది. కాకున్నచో అవివేకులైన కొందరి వల ఒక గొప్ప ప్రణాళిక దెబ్బతినగలదు. ఆ ప్రణాళిక దె తినినచో, సామాజిక, ఆర్థిక సమానత్వమన్నది కొన్ని వర్గము వారికి అందరాని విషయమై వర్గరహిత సమాజ స్థాపనమన్న గగన పుష్పమై ఉండగలదు.

***

వర్గరహిత సమసమాజ స్థాపనే మన ధ్యేయం

# వెనుకబడిన వర్గాల కళలు-కుటీర పరిశ్రమలు

'చేనేత పితామహ' గుంటక నరసయ్య పంతులు *

ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిపోయి, నిన్న మొన్నటివరకు రెండవస్థాయి, మూడవస్థాయివారుగా పరిగణింపబడిన వెనుకబడిన తరగతుల ప్రజలలోని ప్రతిభ కాలాంతరము నుండి సృజించిన సత్కళలు— ఈ కుటీర పరిశ్రమలు. ఈ నిత్య దైనందిక జీవితానికి సంబంధించిన 'కృషి'ని పారమార్థిక దృష్టితో దర్శించి, కృషినే ఒక కళగా భావించి, జీవితానికి నిత్యమూ అవసరమయ్యే పనులనే కళలుగా తయారుచేసిన ఈ వర్గాల ప్రజల ప్రతిభ సంస్తవనీయము. ఆ కృషి కళలే కుటీర పరిశ్రమలు. కాని ఈ కుటీర పరిశ్రమలు కేవలం చేతివృత్తులని పిలువబడి, ఈ పరిశ్రమల నాశ్రయించిన వర్గాలవారు వెనుకబడిన వర్గాల వారిగా తయారు కావడము చరిత్ర చేసిన తమాషా!

ప్రాచీన కాలమున భారతవర్షమునకు చేతి వృత్తులు, అందు ముఖ్యముగా చేనేత వృత్తి బంగారుపంటగా ఉండెడివి. ఇది ప్రాజ్ఞులందరు ఎరిగిన సత్యమే. దేశమునకు వెన్నుముక అయిన ఇచ్చటి పరిశ్రమలు పరాయి ప్రభుత్వకాలమున క్రమముగా సన్నగిల్లిపోయినవి. బ్రిటిషు ప్రభుత్వ కాలమున పూర్తిగా అవసానస్థితికి దిగజారినవి. ఈ పరిస్థితిని గమనించిన ఆధునికులలో ముఖ్యులు జాతిపిత మహాత్మాగాంధీగారు. వీరు కుటీర పరిశ్రమల ఉన్నతికి, ముఖ్యముగా చేనేత పరిశ్రమ పునరుద్ధరణకు ఇచ్చిన ప్రాధాన్యము, చేసిన కృషి అందరికి తెలిసినదే. భారతదేశ భాగ్యదేవతగా అవతరించిన యుగపురుషులు మహాత్మాగాంధీగారు. వారి ఈ కుటీర పరిశ్రమల పునరుద్ధరణ నినాదము దేశాభిమానులను ఉత్సాహపూరితులను చేసినది. పారిశ్రామిక వర్గమునకు ఆశాదాయకమైనది. వారి ఈ ప్రబోధము మూలమున దేశ నాయకులెందరో ప్రభావితులైనారు. ప్రజలెంతో ఉత్సాహపూరితులైనారు. ఈ శుభసూచనలు బ్రిటిషిండియా వాసులైన పారిశ్రామికులకు ఎంతో కొంత సంతోషము కల్గించినది, కాని అట్టి అవకాశము నైజాము ప్రాంతమువారికి లేకపోయినది. కారణము అట్టి ప్రబోధము చేయగల నాయకులకు ఈ ప్రాంతమున అవకాశముకాని, ప్రవేశము గాని లేకపోవడమే.

నైజాము పాలనలోగల ప్రాంత మందంతటగల చేతి వృత్తులవారి జీవితము కడు దుర్భరముగా ఉండెను. ఈ చేతి పరిశ్రమల మీద ఆధారపడిన వారి సంఖ్య తెలంగాణా ప్రాంతములో అధికసంఖ్యలో ఉండేది. అందు అధికసంఖ్యాకులు చేనేత పారిశ్రామికులు. అన్ని చేతివృత్తులవారి పరిస్థితి దాదాపు ఒకే విధమైన దయనీయస్థితిలో ఉండేది. వీరిస్థితి బ్రిటిష్ ఇండియాలోని వారిస్థితికంటే భిన్నమైనది. పెత్తనమంతా గ్రామాధికారులచేతిలో ఉండేది. గ్రామాధికారులు ప్రభుత్వ అధికారులకు మాత్రమే విధేయులు, ఇక గ్రామాలలోగల పారిశ్రామిక వర్గమంతా వారి స్వంత ప్రజలు, వారిచేత తమకవసరమైన పనులు ఉచితముగ చేయించుకొనడమే వారికి తెలిసిన ధర్మము. ఆ బడుగు ప్రజల బ్రతుకు బాగోగుల గూర్చిన ఆలోచన వారికుండేదిగాదు, వారికేగాదు వారిపైనగల ప్రభుత్వాధికారులకు కూడా ఉండేదికాదు. ఇక వృత్తుల మాట చూచితే కడునీరసము. ఏ వృత్తి అయినా అంతే. చేతిపనులను ఆదరించేవారేలేరు. దానికిమార్కెట్ లేదు. పగలూ రాత్రీ పనిచేసినా కడుపునిండదు. ఆడ మగ పెద్ద చిన్న అందరు శ్రమపడి పనిచేయవలసినదే. అయినా అరకడుపు భోజనమే. ఇక చదువు సంధ్యలకు ఆస్కారము లేదు, పాఠశాలలు ఉండేవి కావు. వైశ్యులు మాత్రము తమవృత్తికి సరిపోయే విద్య కల్గివుండేవారు.

కరణమువారు అంతే. వారికి సరిపడు విద్య వారి పెద్దల నుండే లభించేది ఇందు చేనేత పనివారి బ్రతుకు మరీ దుర్భరము. అసలు చేనేత గుడ్డను అడిగేవారే లేక పోగా, నేసిన గుడ్డకు పన్ను మగ్గమునకు పన్ను. ఈ పన్నులతో పాటు గ్రామ పెత్తందారులకు ఆ పై అధికారులకు అవసరమైన పనులు ఉచితంగా చేసిపెట్టవలె, లేదనడానికి కానీ, కాదనడానికి కానీ వీలులేదు, కర్మగాలి అంటే వీపు పగలవలసిందే.

ఇట్టి బాధలు పడలేక, దుర్భర జీవితము గడపలేక ఈ ప్రాంతము నుండి లక్షలాది చేనేత పనివారు పర ప్రాంతములకు వెళ్ళి జీవించడం మొదలుపెట్టారు. అందు బొంబాయి ప్రాంతము పేర్కొన తగినది. ఆ ప్రాంతమునగల ముఖ్య పట్టణములు షోలాపురం, అహ్మద్ నగరం, పూనా, బొంబాయి పట్టణములు పేర్కొనదగినవి. ఈ పట్టణాలలో అనేక లక్షలాది చేనేత పారిశ్రామికులు యిప్పటికీ ఉన్నారు. అందు కొందరు స్థిరపడిపోయినారు గూడ. వారిలో కొందరు మంచి అభివృద్ధి పొంది గొప్ప గొప్ప పరిశ్రమలను కూడా స్థాపించుకొన్నారు.

తెలంగాణా ప్రాంతము నుండి మహారాష్ట్ర ప్రాం
వెళ్ళినవారు అక్కడి నాయకుల ప్రబోధము నాలకిం

* హైద్రాబాదు రాష్ట్ర చేనేత ఉద్యమ కార్యాలు, హైదరాబాదు.

బ్రిటిషు పాలనలోని సౌఖ్య జీవనమును గమనించి ఇక్కడి శ్రమజీవుల కష్టములను తలచుకొని కంటతడిబెట్టేవారు. దీనికి నిదర్శనము బొంబాయి ప్రాంతములో ఏర్పరచబడిన నైజాము ప్రజల హితచింతక సంఘము. ఈ సంఘము ద్వారా బ్రిటిషు ప్రభుత్వమువారికి ఇక్కడి వారి కష్టవిమోచనము కొరకు మొర పెట్టుకొనడము జరిగి, దానిపై వారు చర్య తీసుకొనడం పేర్కొన తగినది. అల్లే ఇక్కడి చేనేత వారి కష్టములను చూచి సహించలేక బొంబాయిలో నొక నిజాం పద్మశాలి హితచింతక సంఘము అనే పేరనొక సంఘము స్థాపించి, ఆ సంస్థ ద్వారా, ఇక్కడ నిజాం రాష్ట్ర పద్మశాలి కష్ట నివారణ సంఘము అనే పేర సంస్థ నేర్పరచి కృషి చేయటం జరిగినది. ఈ సంస్థల ద్వారా ఈ ప్రాంత పారిశ్రామికుల, వెట్టి పట్టి ఇత్యాది కష్ట నివారణలకు కృషి చేయటం జరిగినది. చేనేత కుటుంబీయులు అధిక సంఖ్యాకులుగా వున్న గ్రామములకు పై కష్ట నివారణ సంఘము ద్వారా ప్రచారకులను పంపి తగు ప్రబోధములు గావించి, వారిని చైతన్యవంతులను గావించడం జరిగినది. ఇట్టి అయా సందర్భములలలో అచ్చటచ్చట గల ఇతర చేతి వృత్తుల వారిని గూడ సమావేశపరచి ప్రబోధించడం జరిగేది. దాని పర్యవసానముగా 1940,45 వరకు ఇచ్చటి నేత కుటుంబీయుల కష్టములన్ని సుమారుగా తుడిచిపెట్టడం జరిగింది. ఈ ఉద్యమము ఇతర కుటీర పరిశ్రమలవారిని కూడా ప్రభావితులను చేసినది. దీనినే ఆదర్శముగా ఆశ్రయముగా తీసుకొని ఇతర కుటీర పరిశ్రమల వారు గూడ తమ వృత్తి సంఘములను ఏర్పరచుకొనడం జరిగింది. తెలంగాణాలోని విశాల ప్రాంతమందంతట గల చేనేత వృత్తివారందరు (ఒకటి రెండు జిల్లాలు తప్ప) పద్మశాలీయులే. వీరు ప్రతి ఊర లెక్కింపదగినంతగా ఉండేవారు కొన్ని గ్రామాలలో సగము ఊరు వరకు వీరే ఉండేవారు. ఇంటిలోనివారందరు ఆడ మగ పెద్ద చిన్న అందరూ వృత్తిలోనే నిమగ్నమై ఉండేవారు. మా చిన్నతనమున చేనేత వృత్తి ఒక పద్మశాలి కులము వరకే పరిమితమైనదిగా భావించేవారము. వీరిలో లక్షలాదిగా మహారాష్ట్ర ప్రాంతమునకు పోయినను, ఇక్కడి మన జన్మభూమిని మరవడం జరుగలేదు. శక్తిగలవారు యువకులు పై ప్రాంతమునకు జీవనోపాధికై వెళ్ళినను పెద్ద వయస్కులు, ఆడవారు పిన్నలు ఇక్కడే ఉండేవారు. ఈ కారణముచేత రాకపోకలు నిరంతరము జరుగుచుండేవి. అందు మాబోటి వారు కొందరు ఈ ప్రాంతము వచ్చినప్పుడు ఇక్కడి వారి కష్టములు గమనించి తన్నివారణోపాయములను వెదకే వారము. ఈ ప్రాంతము వచ్చినప్పుడు తరచుగా వీరికి ప్రబోధములు గావించి మేల్కొల్పడం జరిగేది. దీనికి ప్రభుత్వోద్యోగులు గ్రామ పెత్తందారు అవరోధం కల్గించేవారు. ఒక్కొక్కప్పుడు ఊళ్లో నిలువనిచ్చేవారు కాదు. అయితే నైజామేతర ఆ ప్రాంత సోదరులు విజ్ఞప్తి కారణముగా, బ్రిటిషు ప్రభుత్వము వారి ఒత్తిడి మూలముగా. ఇక్కడి నైజాము ప్రభువుగారిచేత, "చేతి వృత్తుల వారిచేత వెట్టిచాకిరి చేయించుకొనరాదు" అని జారిచేసిన ఫర్మానాలు ఫర్మానాములలో మాకు అక్కరకు వచ్చేవి. ఈ రూపమున ఇక్కడ జీవచ్ఛవములవలె పడివున్న సోదరులను మేల్కొలపడము జరిగేది.

నిజాము పాలనలో పలురీతుల ఇట్టి కష్టములను అనుభవించిన ప్రజలు పోలీసు చర్య అనంతరం, స్వతంత్ర వాయువులు పీల్చి బంధనమూడిన పక్షుల వలె పరవశించినారు. అచిరకాలములో అపరిమిత చైతన్యపూరితులైనారు. సంప్రదాయ పరంపరలందించిన క్రియాశీలతనూ, వృత్తినైపుణ్యములను వీడక, ఆధునిక పరిజ్ఞానము నాకళించుకొని చేతివృత్తులకు సంబంధించిన కొన్నింట అంతర్జాతీయ ఖ్యాతి నార్జించినారు. పోచంపల్లి పరిశ్రమ, నిర్మల్ పరిశ్రమలు ఇందుకు రెండు చక్కని ఉదాహరణములు. కొయ్య, లోహ పరిశ్రమలలో సమస్త ఆంధ్రావనికి ఆదర్శప్రాయముగ నిలిచినారు.

ఈ వృత్తికళాకారుల పురోగతికి స్వాతంత్ర్యానంతర భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కల్పించిన సౌకర్యములు కొంతవరకు తోడ్పడిన మాట సత్యమే. కాని వారికి సంపూర్ణ ఉత్తేజ, ప్రోత్సాహములు కూడా ఇంకా లభ్యము కాలేదను — మాట కూడ సత్యమే. వారి సమస్యలు అనేకము ద్విగుణీకృతములై పట్టి పీడించుచున్నవి. వెనుకబడిన కులముగా, కలకాలమునుండి పేరొంది, స్వతస్సిద్ధముగా ప్రతిభ ఉన్నను సరైన గుర్తింపుపొందని ఈ పేద కళాకారులను సహృదయముతో, కళామయమైన హృదయముతో అర్థము చేసికొని సహకరించ వలసిన నాయకులు కరవైనారు. వెనుకబడిన తరగతులలో విశేషించి, ఈ కళాకౌశల్యముగల వారి కష్టసుఖములను అర్థము చేసికొని పరిస్థితిని మెరుగు పరచుటకు, ఈ రంగములకు చెందిన నాయకులు ముఖ్య స్థానములలో నుండి సహకరించవలసి ఉన్నది. అన్య ఉన్నత వర్గముల వారు ఎంత సహృదయులైనను, దైనందిక జీవితమున ఈ వర్గ ప్రజలు ఎదుర్కొను నిత్య కష్ట సుఖములను ప్రత్యక్షముగ గ్రహింపలేరు. పరోక్షముగనైన గ్రహించి, పరిష్కార మార్గములను ఆచరణలో పెట్టుటకు, మధ్యస్థుల దుండగము విపరీతము. ప్రజాస్వామ్యములో అనుకొన్న సత్ఫలితములన్నియు అందకుండ పోవుటకు సగము ముఖ్యకారణము-ఈ మధ్యస్థుల దండగమే.

శ్రీమతి ఇందిరాగాంధి మీద ఈ వెనుకబడిన వర్గాల వారు పెట్టుకొన్న ఆశలు, నమ్మకములు అపారములు. ఆమె 'గరీబీహటావో' నినాదం, వీరిలో కొత్త ప్రాణమును, కొత్త ఊపిరిని పోసినవి. తమ పాలిటి పెన్నిధివలె, ఆమెను భావించి, ఆమె మాటలచే మిక్కిలి ప్రభావితులై ఆమె స్థాపించిన పార్టీని అధికారములోకి తెచ్చారు. ఇప్పుడు ఆ బడుగు వర్గాల ప్రజల ఆశలను తీర్చి, ఆ పేద కళాకారుల నైపుణ్యమును గమనించి, 'కృషీవలకు' పలురూపములైన కుటీర పరిశ్రమలను పెంచి పోషింపవలసిన కర్తవ్యము ఇప్పటి ప్రభుత్వముపై అత్యంత ముఖ్యముగా నున్నది. వెనుకబడిన తరగతుల సంక్షేమము వాస్తవమున - ఆచరణ రూపమున మూడు పువ్వులు ఆరు కాయలవలె విలసిల్లగలదని భావించుచున్నాను.



CHANDI GARH,
*April* 9, 1979.

I am glad to know that the Andhra Pradesh Backward Classes State Conference is being held on 28th,29th, April 1979. This is really a unique example worthy of emulation by other State Governments. Since the Janata Party came into power in Haryana, we have increased reservations for the backward classes in Government Services from 2% to 5%. We are contemplating many more measures for the uplift of the backward classes and would like to be enlightened about the decisions of the proposed conference.

DEVI LAL,
*Chief Minister, Haryana.*

# తురి జనులు

సి. వి. సుబ్బన్న శతావధాని *

ఈ జాతి ప్రజకు సంఘంలో ఆదరువు శూన్యం. చేనేత పనివారి బ్రతుకు ఈ జాతికి చెందిన బ్రతుకు. వీరు మధ్యీయులు.

"తురి" అనగా కొమ్ము. మగ్గము నేయునపుడు ఉపయోగించు సాధనము. దీనినే "నాడి" అని కూడ అందురు. చేనేత పనివారిని "తురిజనులు" అనవచ్చును.

హరిజనులు అనే నామకరణం చేసిన అమృతహృదయుడు గాంధి మహాత్ముడు. ఆయన రాట్నం చేతబట్టుకొని "తురి జనుడే" అయినాడు. హరిజనులకు, తురిజనులకు ఎంతో మేలు చేయాలని కృషి చేసినాడు.

ఇల్లు—వాకిలి—ఉద్యోగము. లేదా ఆర్థిక సౌకర్యము హరిజనులకు వలెనే తురిజనులకు కలిగించడం ఎంతైనా అవసరము.

ప్రభుత్వం చేనేత వృత్తి అభ్యుదయానికి ఎంతో కృషి చేస్తూ ఉంది. ఈ కర్చు సంస్థల అకౌంట్సులో అంకెల రూపంలో పెద్ద యెత్తున కనిపిస్తుంది. వస్తుతః నేతపనివారి పరిస్థితి మరీ నికృష్టంగా దిగజారిపోతూ వుంది.

నిరుపేదలైన తురిజనులకు (నేతపనివారికి) హరిజనులకు వలెనే యిండ్లు కట్టించి యివ్వడం, చేసే సహకారం ఏదో అది సంఘాల ద్వారా కాక, నేరుగా వ్యక్తులకే అందజేయడం ప్రభుత్వ కర్తవ్యము. ప్రస్తుతం ఈ రెండు విషయాలు ప్రధాన విషయాలు. నాయకులు, ప్రభుత్వమువారు నేరుగా అందే లాగున చేనేతపనివారికి సహాయం చేయడం ప్రయోజనకారి కాగలదని గుర్తింతురు గాక.

మయా స్పష్టం" అన్నాడు గోవిందుడు.
ప్త లేదు. దాని సృష్టికర్త ఎవడు ?

ముఖమాసీత్, బాహూ రాజన్యః
యద్వైశ్యః పద్భ్యాం శూద్రో
ఋగ్వేదవాణి. పంచమవర్ణ ప్రసక్తి
దు.

రే పంచమవర్ణం వారై కూర్చున్నారు.
ష్ట శిక్షాస్మృతిలో ఎంత ఘోరమైన
ఎలకు మరణ దండన లేదు. ఊరిలో
ు ఉరిశిక్షగా భావించినారు. రాజ
వ బ్రాహ్మణులు సంఘబహిష్కృతులై
గిన బొంత జతచేసికొని గుడిసెలో
వారే పంచములు. అందుకే పంచ
టివారు" అనే ప్రథ ఉంది. తక్కిన
తుని ముఖము నుండి, బాహుల నుండి,
నుండి పుట్టినట్లు చెప్పిన వేదపురుషుడు
 జన్మస్థానం నిర్దేశించకపోవడానికి
రే లేదు.

ు పంచమ వర్ణం భగవంతుని "చిన్న
ందున "హరిజన" నామకరణం రూఢి

సంతానం, అంత్య వర్ణం కనిష్ఠ
పను తండ్రి ప్రేమిస్తాడు చిన్న
్తుంది. రెండవ వర్ణం భుజబలంతో,
తో పైకి వస్తుంది. మధ్యీయులను

* పద్మశాలి సంఘాధ్యక్షులు, ప్రొద్దుటూరు.



*Bhubaneswar,*
11*th April,* 1979

It gives me great pleasure to learn that a State Level Backward Classes Conference is being organised under the auspices of the Government of Andhra Pradesh on April 28th and 29th 1979, to highlight the welfare measures undertaken by the State Government for the benefit of Backward Classes and to suggest suitable further measures for their accelerated progress in the State. I have no doubt that the Conference will go a long way in creating an atmosphere conducive to the upliftment of the backward classes in Andhra Pradesh. I am glad that the Government of Andhra Pradesh have risen to the occasion and are determined to ameliorate the condition of the Backward Classes which constitute more than 50% of the State's population.

I wish the Conference all success.

NILAMONI ROUTROY,
*Chief Minister,*
*Orissa.*

అనేక కార్యాలయాలలో వెనుకబడిన తరగతుల వారికి 25% ఉద్యోగాలు ఖచ్చితంగా ఇవ్వబడలేదు. దీనికి మరో కారణం కూడా ఉంది.

మొన్న మొన్నటివరకు సర్వీసు కమిషను వారు పరీక్షలు నిర్వహించే అవకాశం లేక పోయింది. జిల్లాలలోనూ, రాష్ట్ర రాజధానిలోనూ కూడా తాత్కాలికంగా అనేక వేల మందిని ఉద్యోగాలలోనికి తీసుకొన్నారు. ఉద్యోగ సంఘాలు చేసిన ఆందోళనపై వారినందరిని ఒక చిన్న పరీక్ష పెట్టి ఖాయం చేశారు. ఇట్టి పరీక్షలు మూడు సార్లు జరిగాయి కాబట్టి 1972 నుండి ఏర్పడ్డ కాళీలలో కూడా 25% వెనుకబడిన తరగతుల అభ్యర్థులకు లభించ లేదు. తాత్కాలిక ఉద్యోగాలు సంపాదించుకోగలిగిన పలుకుబడి గల అభ్యర్థులంతా శాశ్వత ఉద్యోగులై పోయారు. తర్వాత ఏర్పడ్డ బహు కొద్ది ఖాళీలకు మాత్రమే సర్వీసు కమిషను వారు పరీక్షలు పెట్టి అభ్యర్థులను ఎంపిక చేశారు. 1972 నుండిఐనా వెనుకబడినతరగతులకు సదుపాయాలు పూర్తిగా జరిగినాయని చెప్పడానికి ఎంతమాత్రం వీలు లేదు.

స్థానిక సంస్థలలోనూ, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలలోనూ ఇతర ప్రభుత్వ కంపెనీలలోనూ, విశ్వ విద్యాలయాలలోనూ ఏర్పడ్డ ఖాళీలలో కూడా 25% వెనుకబడిన తరగతుల వారికి మినహాయించాలని కమిషను వారు సలహా ఇచ్చారు. ప్రభుత్వం ఆ సలహాలను ఆమోదిస్తూ ఆదేశాలు ఇచ్చింది. కాని పైన పేర్కొన్న సంస్థలలో రిజర్వేషనులు సరిగా అమలు జరుగ లేదు. ఆంధ్రప్రదేశ్ శాసన సభా వారు నియమించిన శ్రీ అగిశం వీరప్ప కమిటీ వారు సమర్పించిన నివేదికలో ఈ విషయం సోదాహరణంగా చెప్పారు. మన రాష్ట్రంలో ప్రభుత్వ అధిపతుల కార్యాలయాలు ఎన్ని ఉన్నవో వాటికి స సమాన సంఖ్యలో రాష్ట్ర ప్రభుత్వ కంపెనీలు, కార్పొరేషను ఉన్నాయి. వీటిలో ఎన్నో ఉద్యోగావకాశాలు ఉన్నాయి. సంస్థలలో వెనుకబడిన తరగతుల వారికి ప్రాతినిధ్యం [illegible] అర్థ గణాంక శాఖ వారు ఈ మధ్య కొన్ని లెక్కలు ప్రక[illegible] చారు. దాని ప్రకారం పై పదవులలో వెనుకబడిన తరగత వారి సంఖ్య 14%కు పరిమితమై ఉన్నదని పేర్కొన్నారు.

## సదుపాయాల పొడిగింపు అవసరం

ఇదిగాక గ్రామాలలో మునసబు, కరణం, [illegible] పట్వారీఉద్యోగాలు ఉన్నాయి. వీరికి జీత భత్యాలు తక్కు[illegible] సాంఘిక పలుకుబడి ఎక్కువ. ప్రభుత్వం ఇది గమని గ్రామాధికారుల నిబంధనలు సవరించింది. దీని ప్రకా[illegible] రెవిన్యూ డివిజనులోనూ ఏర్పడ్డ ప్రతి రెండు ఖాళీలలో రెండవ స్థానము షెడ్యూలు కులాలు, షెడ్యూలు [illegible] వెనుకబడిన తరగతుల వారికి విధిగా ఇవ్వాలని ఉంది. [illegible] ఇది సరిగా అమలు జరగడం లేదని చెబుతున్నారు. అం[illegible] ఆదేశాలు వేరు అమలుపరిచే తీరు వేరు అని మనకు తెలుస్తు[illegible] గ్రామ పంచాయతీలు, జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమి[illegible] మునిసిపాలిటీలు మొదలైన స్థానిక సంస్థలలో ఎన్నో ఉద్[illegible] ఖాళాలు ఉన్న విషయం అందరకు తెలిసినదే. కా[illegible] ఖాళీలలో వెనుకబడిన తరగతులకు చెందవలసిన శాతం అ[illegible] జరగడం లేదు. ఇది వెంటనే సరి దిద్ద వలసి ఉంది.

పైన పేర్కొన్న పరిస్థితులను దృష్టిలో ఉంచు[illegible] ప్రభుత్వం వెనుకబడిన తరగతులకు ఇవ్వవలసిన సదుపా[illegible] 1990 వరకైనా పొడిగించడం ఎంతైనా అవసరం.

—)(—

# చేతివృత్తులకు చేయూత

గోలి వీరాంజనేయులు*

త్వరితగతిని అభివృద్ధి చెందుతున్న మన దేశంలో ఈనాటికి వంశపారంపర్యంగా వస్తున్న కొన్ని వృత్తులను ఆధారం చేసుకొని జీవనం సాగించే ప్రజలు కోకోల్లలుగా వున్నారు. వీరు కుమ్మరిపని, కమ్మరిపని బుట్టలు అల్లటం, నేత నేయడం, గానుగ నడిపి నూనె తీయటం, నగలు తయారు చెయ్యటం, కల్లు గీయటంవంటి వృత్తులలో నిమగ్నులై యున్నారు. కేంద్రములోను రాష్ట్రాలలోను ప్రజాప్రభుత్వాలు ఏర్పడ్డ తర్వాత కుల ప్రాతిపదికపై తరతరాల నుండి వస్తున్న ఈ వృత్తులను ఆధారం చేసుకొని జీవించే ప్రజలను వెనుకబడిన తరగతులుగా పరిగణించి వారికి ప్రభుత్వం వారు చేయూతనిస్తూ ఆదుకోవటం జరిగింది యున్నాళ్ళు. ఈ వృత్తులలో వుంటూ పూర్వము నుంచి మన సంస్కృతి, సాంప్రదాయాలలో భాగంగావుంటూ వస్తున్న అనేకమైన కళలను ఈ వృత్తులవారు పోషించడం జరుగుతుంది. యంత్రాలను ప్రవేశపెట్టి మన దేశములోని అనాదిగా వస్తున్న వృత్తులను బ్రిటిష్ ఇండియా కాలంలో తెల్లవారు చాలావరకు దెబ్బతీసినప్పటికి ఈ రోజుకీ ఈ వృత్తులు నిలబడ గలిగాయంటే ఇదిమన దేశానికే గర్వ కారణం. అంతేకాదు ఈవృత్తులయొక్క అవసరాన్ని మనం గుర్తించినట్లు నిదర్శనం కూడా. స్వదేశంలో మన దైనందిన జీవితంలో అవసరాల మేరకు ఈ వృత్తుల వారు వస్తుసంపదను అందించటమే కాకుండా అట్టివస్తువులను ఇతర దేశాలకు ఎగుమతి చేయటంద్వారా మనకు ఖ్యాతిని విలువైన విదేశీమారక ద్రవ్యాన్ని ఆర్జించి పెడ్తున్నారు.

ఈ పారిశ్రామికుల మనుగడకై జాతీయస్థాయిలో జాతినేత శ్రీమతి ఇందిరాగాంధి గారు కృషిచేయగా రాష్ట్రస్థాయిలో మన ప్రియతమ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డి గారు ఎనలేని కృషి చేసారు—చేస్తూవున్నారు. ఈ యజ్ఞంలో భాగంగా యిటీవల మన రాష్ట్రంలో జిల్లా స్థాయిలో అన్ని జిల్లాలలో వెనుక బడిన తరగతుల మహా సభలను జరిపించటం జరిగింది. యిది ఎంతో ముదావహం, రాష్ట్రస్థాయిలో వెనుకబడిన తరగతుల సమావేశాన్ని ఏర్పాటు చేయటం ఈ తరగతులవారి అదృష్టంగా నేను భావిస్తున్నాను. పూజ్యులు ముఖ్యమంత్రి గారు వెనుక బడిన తరగతులకు చెందిన యితర మంత్రివర్యులు అభినందనీయులు.

వెనుక బడిన తరగతుల వారికి ప్రభుత్వంవారు యిచ్చే రాయతీలను యింత వరకు కలిగించిన వసతులను, సదుపాయములను—విద్యా విషయాలలో కాని. వుద్యోగావకాశాలలోగాని మరొక 10 సంవత్సరాలు పొడిగిస్తే బాగుంటుంది. తద్వారా ఈ వర్గాల ప్రజలు అభివృద్ధి చెందటానికి మరింత ఆస్కారం కలుగుతుంది.

అంతేకాకుండా ప్రభుత్వంవారు ఈ వర్గాల ప్రజల సమస్యలను సానుభూతితో పరిశీలించి షెడ్యూల్ కులాలకు చెందిన ప్రజలకు చట్టరీత్యా కలిపించిన వసతులను వెనుకబడిన తరగతులకు చెందిన కులాల వారికికూడా వర్తింప జేసినట్లయితే అధిక సంఖ్యలో ఈ ప్రజలజీవనం అనతికాలంలో మెరుగుపడే అవకాశం కలుగుతుంది.

ఆర్థికంగా వెనుకబడ్డ దృష్ట్యా వున్నత కులాలకు చెందిన ప్రజలకు సహాయం చేసేందుకుగాను ప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఒక నిధిని ఏర్పాటుచేస్తే బాగుంటుందని వెనుకబడిన తరగతులకు కేటాయించిన సొమ్మును వెనుకబడిన తరగతుల ప్రజల క్షేమానికే వుపయోగించడం మంచిది.

* మాజీ కార్యదర్శి, ఆం. ప్ర. వెనుకబడిన తరగతుల కాంగ్రెస్.

# సమష్టి జాతి

డా|| బోయి భీ

''చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణ కర్మ విభాగశః''
అంటూ కృష్ణపరమాత్మ ప్రకటించే నాటికి
వర్ణాలు నాలుగే !
''నాస్తితు పంచమః''
అయిదో వర్ణం లేదు.

ఆ నాలుగు వర్ణాలైనా
ఆయా వ్యక్తుల గుణాలను బట్టీ
చేసే వృత్తులను బట్టీ నిర్దేశించబడినై,
అప్పటికి వృత్తులు నాలుగే.

ఒక వృత్తినుంచి మరో వృత్తికి మారే వీలు
ఒక వర్ణం నుంచి మరో వర్ణానికి మారే వీలు
ఆ నాడుంది.
''జన్మనా జాయతే శూద్రః
బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః''
జన్మతో ప్రతి వాడూ శూద్రుడే
ప్రకృతి ధర్మాన్ని అనుసరించే ప్రాకృతుడు !
కృషితో, జ్ఞానంతో పెరిగి పెరిగి
చివరకు బ్రహ్మ జ్ఞానాన్ని ఆర్జించిన వాడే
బ్రాహ్మణుడవుతాడు.
బ్రహ్మ జ్ఞానం ఒక డాక్టరేటు లాంటిది,
అది పుట్టుకతో వచ్చేది కాదు.

వేశ్యాపుత్రుడు వశిష్ఠుడు బ్రాహ్మణుడైనాడు,
సూత పుత్రుడు కర్ణుడు క్షత్రియుడైనాడు
రజకుడు నారదుడు దేవర్షి అయినాడు
గీత పని కాడు విరటుడు రాజైనాడు
హరిజన గిరిజనుడు వాల్మీకి ఆది కవి అయ
బెస్త కన్య కొడుకు వేదవ్యాసుడైనాడు
ఆ నాడు అందరూ ఈ విధంగా
గుణ కర్మలను బట్టి గొప్పవాళ్ళైన వాళ్లే
ఎక్కడ ఎలా పుట్టారనేది ప్రధానం కాద
మహర్షులూ, బ్రహ్మర్షులూ అంతా అవర్ణ
సవర్ణులనే వాళ్లెవరూ ఆనాడు లేరు.

భారత కాలం నాటికి లేని పంచమ వర్ణం
ఆ తర్వాత ఎలా ఏర్పడింది?
ప్రబంధకాలం నాటికి
అష్టాదశ వర్ణాలెక్కడనుంచి వచ్చాయి ?
ఈ నాడు వందలు వేలు ఎలా అయ్యాయి
ఇవి కృష్ణ పరమాత్మ సృష్టించినవి కావే
మరెవరు సృష్టించారు ?

వేదాలను ఉపనిషత్తులను వదిలేసి,
ఆర్ష ధర్మాన్ని హిందూమతంగా మార్చి,
కులం పుట్టుకతోనే వస్తుందంటూ
శాసనాలు చేసిన స్మృతి కర్తలెవరు ?
వాళ్లే వైదిక ధర్మానికి ద్రోహం చేశారు
మెరిట్టును చంపేశారు.
సహజ వికాసాన్ని తుంచేశారు
జాతిని ముక్కలు చేసి, నిర్వీర్యం చేసి
దాస్యంలో ముంచేశారు !

---

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యుడు.

ఓ హరిజనుడా ! గిరిజనుడా ! బహుజనుడా !
మేధావీ ! విద్యార్థీ ! యువకుడా !
ఈ కృత్రిమ కుల భేదాలు తొలగకుండా
భారత జాతి ఏక జాతి కాగలదా ?
దేశం అగ్రశ్రేణికి చేరగలదా ?
ఆలోచించండి !

అసలు రహస్యం తెలుసుకోండి!
పులులూ, నక్కలూ కలిసి
గొర్రెల్ని వంచించడం కోసం
కల్పించిన దుష్టసిద్ధాంతమే కర్మ సిద్ధాంతం,
గుణ కర్మలను బట్టికాక
పుట్టుకతోనే కులం వస్తుందనడం
సాక్షాత్తు భగవద్ద్రోహం
గ్రాడ్యుయేట్ కొడుకు
పుట్టుకతోనే గ్రాడ్యుయేట్ అవుతాడంటే
నమ్మేటంతటి మూర్ఖులమా మనం?

కుల తత్వాన్నే కాదు
కుల వ్యవస్థనే నిర్మూలించాలి
హిందూ మతం కాదు
వేద మతం మనది.
ఆర్ష ధర్మానికి కల్పించబడ్డ అపార్థాలను
"కృణ్వంతో విశ్వమార్యం" నినాదం కాళ్ళకు
తగిలించబడ్డ సంకుచిత స్వార్థ శృంఖలాలను
చెండాడి ఖండించి వెయ్యండి !
కులాంతర వివాహాలతో
సమష్టి గ్రామ నిర్మాణాలతో
సేద్య భూముల జాతీయాకరణతో
కులం మాన్పిడి శాసనాలతో
ఏక జాతి ఆవిర్భావం కోసం
సమ సమాజ సిద్ధికోసం
నడుం బిగించి ముందుకు సాగండి !
విశ్వానికే వేదాంత దేశికులైన మీరు
సర్వజన శ్రేయస్సందేశకులు కూడా కండి!

# కులవ్యవస్థ - వెనుకబడిన జాతులు

డాక్టర్ అంతటి నరసింహం*

మన దేశసమాజంలో అస్పృశ్యతకూ, వెనుకబడిన తనానికీ ప్రత్యక్ష కారణం కులవ్యవస్థ. ఇది మొదట వర్ణవ్యవస్థా రూపంలో వుండేది. అంటే రంగునుబట్టి హెచ్చుతక్కువలు నిర్ణయింపబడేవి. ఆర్యులు భారత దేశములో అడుగుపెట్టేటప్పటికే అనార్యజాతులు కొన్ని ఉన్నత నాగరికతను కలిగివుండేవి. యుద్ధాలుచేసి ఆర్యులు అనార్యులను లొంగదీసి బానిసలుగా చేసుకున్నారు.

ఆర్యులు తెల్లనివారు. అనార్యులు రంగుతక్కువవారు. వారి కలయికవల్ల రంగు తక్కువ సంతానం కలుగజొచ్చింది. రంగు మారడం ఆర్యులకు ఇష్టంలేదు. కలయిక అనివార్యం కావడంవల్ల రంగుమారుతూనే వుంది. ఈ పద్ధతిని నిరుత్సాహపరచడానికి వర్ణవ్యవస్థ యేర్పడింది. ఆర్య అనార్యుల మధ్య కలయికను ఈ వ్యవస్థ బాగా నిరుత్సాహ పరిచింది. అయినా అనులోమ విలోమ వివాహాలను ఒక మోస్తరుగా ఒప్పుకొనేవారు. యుద్ధాలలో ఓడిపోయిన ఆర్యుల స్త్రీలను అనార్యులూ అనార్య స్త్రీలను ఆర్యులూ ఆక్రమించడం వల్ల ఈ రంగు తక్కువ సంతానం కలగడానికి గూడా ఒక కారణమయింది. అనార్య స్త్రీలవల్ల ఆర్యులకు కలిగే సంతానాన్ని తమ సంతానంగానే ఒప్పుకున్నప్పటికి వారు వేరే పెరగవలసి వచ్చేది. భీముడికి హిడింబవల్ల ఘటోత్కచుడూ అర్జునుడికి చిత్రాంగదా ఉలూచిలవల్ల కలిగిన ఇరావంత బభ్రువాహనులూ దూరంగా తల్లులవద్దనే పెరగవలసి వచ్చింది. తమ సంతానానికి తక్కువస్థానం (రంగుభేదం వల్ల) యిచ్చే ఈ పద్ధతే పోనుపోనూ కుల వ్యవస్థకు దారి తీసి అనేకానేక కులాల వేర్పాటుకు దారితీసింది.

అనార్యస్త్రీకి పుట్టినందువల్లనే భీష్ముడికి రాజ్యాధికారం లేదు. మహావీరుడయినా తానూ, మహాజ్ఞాని అయినా విదురుడూ ద్వితీయ శ్రేణి పౌరులుగానే వుండిపోయారు. ఇతరులకు పుట్టారన్న మిషచేతనే పాండవులకు రాజ్యాన్ని తిరస్కరించడం జరిగింది. తెల్ల రంగుకు గల ప్రాధాన్యం అప్పట్లో (ఇప్పుడుగూడా) చాలా అధికం. అందుకే రంగుమారడం అంటే ఆర్యులకూ, వారి సంతానానికీ (రంగుమారిన సంతానానికిగూడా) చాలా అసహ్యంగా వుండేది.

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే
వర్ణ సంకరః".

అని అర్జునుడు పరిదేవనం పొందుతాడు. అంటే క్షత్రియ సంహారం జరిగిపోతే వారి స్త్రీలు దుష్టులయిపోయి రంగుతక్కువ వారితో కలిసి రంగు తక్కువ సంతానాన్ని కలగించి వర్ణసాంకర్యం కలిగిస్తారనిభయం ద్వితీయ శ్రేణి ఆర్యులయిన బ్రాహ్మణుల నియోగించి క్షత్రియ సంతానం కలిగించే పద్ధతి అంటే నియోగపద్ధతి అమల్లోకి తీసుకరాబడింది. అట్లాంటి సంతానమే ధృతరాష్ట్ర పాండురాజ విదురాదులు. అంతేగాదు, అనేక క్షత్రియజాతులు బ్రాహ్మణుల సంతానమనే భారతాది పురాణాల్లో అనేకచోట్ల చెప్పబడింది. అందుచేతనే ఆరాజ్యాలన్నీ బ్రాహ్మణుల పలుకుబడితో, వారి సలహాలతో నడిచేవి. వారిని మించి పరాజు ప్రవర్తించగూడదు అట్లా ప్రవర్తిస్తే వారికి కీడుమూడినట్టే. వారిని తొలగించి మరొకణ్ణి రాజును చేసే తంత్రజ్ఞత వారి చేతుల్లో ఉండేది. మాయావతారాలు అన్ని యిట్లాంటి సత్యాన్నే బహిర్గతం చేస్తాయి.

సంఘంలో తెల్లవారూ, రంగుతక్కువ వారూ కలవకుండా చేసేపని బ్రాహ్మణులూ పరిపాలకులూ నెత్తిన వేసుకొని అది కొనసాగాలంటే విద్యానిషేధం చేసి బహుజనుల్లో వ్యక్తిత్వ స్పృహ లేకుండా చేసేశారు. సరిగ్గా ఈ పరిస్థితుల్లోనే కుల వ్యవస్థకు అంకురార్పణ జరిగింది. పరిపాలకులూ, వారి బంధువులూ, బ్రాహ్మణులూ శరీర కష్టం చేయకుండా సుఖ భోజనం చెయ్యడానికీ, విలాసాలు అనుభవించడానికీ, వీలు కలిగింది. ఇదే బాగున్నదని కుల వ్యవస్థను పటిష్ఠం చేసేశారు. శ్రమజీవులకు విద్యావకాశాలూ, ఆస్తి సంపాదనావకాశాలూ తగ్గాయి.

రంగుమారినాక వచ్చిన ఈ కులవ్యవస్థలో వర్ణానికి, అంటేరంగుకు ప్రాధాన్యం లేదు. కపిల వర్ణుడు బ్రాహ్మణుడూ, అరుణ వర్ణంగలవాడు క్షత్రియుడూ, పీతవర్ణం గలవాడు వైశ్యుడూ, కాలవర్ణుడు శూద్రుడు అని రంగులు చెప్పినప్పటికీ ఆ రంగుల్లో వుండేవాళ్ళను ఆ కులాల పేరుతో పిలువడానికి వీలు లేకుండా పోయింది ఎందుకంటే రంగుమారి దాదాపు అందరూ ఇంచుమించుగా ఒకేరంగుకు వచ్చారు గాబట్టి. అంతేగాదు ఒకే తలిదండ్రులకు భిన్న వర్ణంగల సంతానం కలుగుతూవుంది గాబట్టి. ఒక తండ్రికిగల నలుగురు పిల్లల్లోనూ, రంగులు బట్టి చెప్పాలంటే, వాళ్ళు

* సాంస్కృతిక వ్యవహారాల పరిశోధకాధికారి.

నానా వర్ణాలకు గలిగిన సంతానం అని చెప్పవలసి వస్తుంది. ఒకప్పుడు చెప్పుకున్నా తప్పులేదేమో గాని, వివాహ వ్యవస్థ పటిష్టం అయ్యేకొద్దీ,వ్యక్తి రంగుకు ప్రాధాన్యం యివ్వకుండా, ఏ రంగయినా సరే, ఆ తలిదండ్రుల కులమే అని నిర్ణయించడం జరిగింది ఇదీ కులవ్యవస్థ అంటే.

కాని వర్ణశబ్దమూ, కులశబ్దమూ కలిసి కొంతకాలం సహచరించాయి. ఆ సమయంలోనే వర్ణం అన్నది రంగును వదిలి గుణకర్మలకు అన్వయించబడడం జరిగింది. ఇందులో స్వవచో వ్యాఘాతమూ, విరుద్ధ అర్థమూ, కనిపిస్తాయి.

ఈ వ్యవస్థను బౌద్ధజైనులు వ్యతిరేకించారు అయినా చీలిపోయిన జాతిగాబట్టి ఏకత్వభావానికి రాలేకపోయి సమతాభావాన్ని పెంపొందించలేక పోయింది. మూఢ ప్రజల్ని నమ్మించడానికి వర్ణవాదులు వర్ణం దేవుడే కల్పించాడని మోసం చేశారు.

భగవద్గీతలో —

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః

"తస్యకర్తా రమపి మాం విద్యకర్తా రమవ్యయం" అని చెప్పబడింది.

అసలు ఈ శ్లోకం భగవద్గీతత్వానికి అనుగుణమైనది గాదు.అది తత్వ శాస్త్రం. ఈ శ్లోకం సాంఘిక శాస్త్రం. నమ్మించడానికి దీన్ని ప్రక్షిప్తంచేసి భగవంతుడు చెప్పాడనిపించారు.

ఈ శ్లోకంలోనే స్వవచోవ్యాఘాతం వున్నది. చాతుర్వర్ణ్య సృష్టికి నేను కర్తనైనప్పటికి కర్తను కానట్లుగా భావించవలసింది అని కృష్ణుడు అన్నట్లు చెప్పబడింది. కర్త అయి, కర్త కాకుండా ఎట్లా పోతాడు? పైగా ఆయన అవ్యయుడట! అంటె వ్యయం లేనివాడు. అంటే ఎప్పుడూ పూర్ణంగా (ఏకాలంలో అయినా) ఉంటాడని భావన. అంటే కుల తత్వాన్ని శాశ్వతంగావుంచే అర్థం వుందనాలి.

అసలు "చాతుర్వర్ణ్యం" అంటే అర్థమేమిటి? నాలుగు వర్ణాలలోవున్న సమాజం అని అర్థం. అంటె నాలుగు రంగులుగల వ్యక్తులు అని అర్థం. రంగుల బట్టి చెప్పేవాడు ఆ రంగుల బట్టే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనకుండా గుణాన్నిబట్టి, చేసె కర్మను బట్టి వర్ణం (రంగు) నిర్ణయింప బడిందంటారేమిటి! గుణాన్నిబట్టి, పనిని బట్టి వర్ణం ఏర్పడటం ఎట్లా వీలవుతుంది? ఒక దంపతులకుపుట్టిన (వ్యభిచారం లేదనుకుందాం) బిడ్డలను గుణాన్ని బట్టి గానీ, కర్మనుబట్టి గానీ, బ్రాహ్మణుడని, శూద్రుడనీ, అంటరానివాడనీ అంటే ఆ దంపతులు వూరికే వుంటారా? కాబట్టి వర్ణ (రంగు)శబ్దాన్ని ఒక వైపువాడుతూ గుణాన్నిబట్టి కర్మను బట్టి వర్ణం (కులం) వస్తుందనడం ఎంత తప్పిదమో! స్త్రీ శూద్రులూ తదితరులూ కలిసి నూటికి తొంబయ్యేనిమిది మందికి చదువులేకుండా పోయిన సమాజంలో తర్కం నశించి, పై వాదాన్ని ఖండించలేక పోయారు, పైగా దేవుడే పెట్టాడని విశ్వసించారు. ఎంత దయనీయస్థితి.

ఈ సమయంలోనే సమాజాన్ని ఇంకా కట్టుదిట్టంచేసి పనిపాటలు చేసే వారిని ఇంకా తక్కువ శ్రేణికి లాగేశారు. సమానంగా సంపాదనా, సమానంగా గౌరవమూ లభిస్తే చెప్పిన పని చేయరని వారిని ఇంకా క్రిందికిలాగారు. భూమిపై హక్కుగల వారు దురాక్రమణ బుద్ధితో చేసిన పనియిది.

కులాలు కులాలుగానే ఉండాలంటే పరస్పరం వివాహాలు నిషేధించాలి. అదే జరిగింది ఎవరయినా తప్పుచేస్తే ఆ కులంలో నుండి బహిష్కరించే వారు. వారికి స్వత్వాలు వుండేవిగావు. గ్రామ బాహ్యల్లో దూరంగా నివసించే వారు. ఈ విధంగా అనేక కులాలనుండి బహిష్కరింప బడ్డవారు ముందే బహిష్కరింపబడి గ్రామ బాహ్యల్లో నివసిస్తున్న వారిలో కలసి పోయేవారు. పొరుగు ప్రాంతాలకు వెళ్ళి సమానమైన కులంపేరు చెప్పి కొత్త కులంగా గ్రామాల్లోనే కొంతమంది నివసించేవారు ఈ విధంగా అనేకమయిన కులాలు, ఉపకులాలూ, శాఖలూ, వెనుకబడిన కులాలూ గ్రామిక కులాలూ, అంటరాని కులాలూ యేర్పడ్డాయి.

ఈ కుల వ్యవస్థ పటిష్టంగా వుంటే, ఎవరూ కలవకుండా చూసేపని పాలకులపై పెట్టారు. వారికి చాతుర్వర్ణ రక్షణాచర్య అని బిరుదు తగిలిస్తే అదేదో చాలా గొప్పయినట్లుగా తృప్తిపడి కులాచారం తప్పినవారిని కఠినంగా శిక్షించేవారు. ఇదే సమయంలో అనేకమైన పురాణాలలో ఉప పురాణాలు, ధర్మ శాస్త్రాలు వ్రాసి, విద్యాపరులతో, అవిద్యాపరులలో ప్రచారం చేశారు ఇప్పటికి ఆ శాస్త్రాలనూ ఆ పురాణ గాధలనూ. విశ్వసించేవారున్నారు.

ఈ సమయంలోనే పాతివ్రత్యం సృష్టింప బడింది. అది మంచిదేకాని పురుషులు నిరంకుశులై ఎంతమందినంటే అంతమందిని పెండ్లి చేసుకోవడమూ, రహస్యంగా గానీ బహిరంగంగా గానీ వ్యభిచరించడమూ జరగడానికి ఈ వ్యవస్థ దోహదం చేసింది. ఇది కేవలము కుల కట్టుబాట్లను రక్షించడానికి పనికి వచ్చింది.

పొలం దున్నేవారు ఎండలో దున్నాలి. నీళ్ళల్లో, బురదలో దున్నాలి. పైరు నాటాలి, ఎండలోనే కోయాలి. కూలీలు గూడా ఎండలోనే పనిచెయ్యాలి.

చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి వడ్రంగి, సాలె, ఈడిగ (గౌడు), వడ్డె, దూదేకుల మొదలయిన వృత్తిజాతులంతా నిత్యమూ శ్రమిస్తూ, చమటలోడుస్తూ జీవనభృతి సంపాదించాల్సిందే. అంత చేసినా వారికి మిగులు వాసివుండదు. కులాల్లోనేవుండి, కులవృత్తి చేసుకుంటూ వున్నంతకాలం వీరు బీదలుగానేవుంటారు వెనుకబడినవారుగానే వుంటారు. ఇతర కులాలవాళ్లువీళ్ళఉత్పత్తులపై వ్యాపారం చేసి అధిక లాభార్జన చేస్తూ వుంటారు.

ఒక వ్యక్తి బ్రాహ్మణునిగానీ, ఉన్నత కులంలోని వారినిగానీ, గురించి చెప్పే

టప్పుడు, "అతను, ఆయన" అంటాడు. అదే వ్యక్తి వెనుకబడిన జాతులను, హరిజనులను "వాడు" అంటాడు. తనది ఉన్నత కులం అనుకునే వాడంతా తక్కువ కులం అనబడే వ్యక్తిని "వొరే" అనే అంటాడు.

ఈ కులవృత్తులలో గౌరవం లేదు. సంపాదనా లేదు. గ్రామాల్లో చాకలికి ఆస్తి వుండదు. నిత్యమూ బట్టలుతకాలి. పూర్వం రోజుల్లో రాత్రి పూటా ప్రతి యింటి వాళ్లూ కాస్త అన్నం వేసేవారు. సంవత్సరానికి ఒక దంపతులు రూపాయో అర్ధో ఇస్తారు. ఈ విధంగా సంవత్సరానికి పదో, యిరవయ్యో వస్తాయి. పంట కోసేటప్పుడు ఒక మోపు ఇస్తారు. దాని వల్ల కొద్దిగా గింజలు వస్తాయి. మరి కల్లూ సారాయీ, బీడీలు తాగడానికి ఇతర్లను దేబిరించాల్సిందే. రైతులు మాసి చినిగిన బట్టలు యిస్తే అవి వేసుకోవాలి. ఇక వీళ్ళకు గౌరవం యెట్లా వస్తుంది? గౌరవం యిస్తే వీళ్ళు బట్టలుదికి సవినయంగా వాళ్ళ తిట్లకూ కొట్లకూ తలవొగ్గి వుంటారా?

నేటి స్థితి వేరు. అందరూ చదువుకో వచ్చు. చాకలి పిల్లవాళ్ళు కూడా చదువుకుంటున్నారు. చదువుకున్న చాకలి తన వృత్తికి పోడు. తాను చూస్తూఉండగానే తన తలిదండ్రులను హీనంగా సంబోధిస్తూ పశువులకంటే తక్కువగా చూస్తున్నపుడు తాను తన కులవృత్తి స్వీకరిస్తే తన తలిదండ్రులకుండే హీనతే ప్రాప్తిస్తుందనుకోడంలో వింత లేదుగదా! అందుచేత చదువుకున్న చాకలి, చాకలి వృత్తి చేయడు.

మంగలి వృత్తి కూడా అంతే. చాలా మందికి ఆస్తి వుండదు. హీనంగా బ్రతకాల్సిందే. రాత్రిళ్ళు అందరి యిండ్లకూ అన్నం కోసం పోరు గాని, మిగతా జీవితమంతా దాదాపు అంతే. గౌరవం లేదు. ఎక్కువ కులాల్లోని పిల్లవాళ్ళు సైతం చాకలిని మంగలిని "వొరే" అని పిలిస్తూ వుంటే, చదువుకొన్న వాళ్ళ పిల్లలు ఇక ఆ వృత్తికొస్తారా?

కుమ్మరి, కమ్మరి, వడ్రంగి మొదల కులాలవారు గూడా పూర్వం [illegible]ల లో సంవత్సరాంతంలో ఏదో లభించె కొద్ది ప్రతిఫలానికే సంవత్సరమంతా ప్రతి వ్యవసాయదారుడికీ ఊడిగం చేసినట్లే! దాదాపు పైవన్నీ వెట్టి చాకిరీల్లాంటివే.

ఈ పరిస్థితే హరిజనుల్లో గూడా కనిపిస్తుంది. నిత్యమూ రైతులకు కూలి చేసుకొనే కూలీల పిల్లలు చదువుకుంటే, ఆ పనులకు పోరు. అంటే ఉత్పత్తి కార్యక్రమాల్లో భాగస్వాములు కాలేక పోతున్నారు.

మన కులవ్యవస్థలో శ్రమ గౌరవం **(Dignity of Labour)** లేనిదానివల్ల ఈ చిక్కు వచ్చిపడింది. పూర్వం విద్య లేదు గాబట్టి ఎక్కడ పుట్టినవాడు అక్కడే పడివుండి, ఆ కులవృత్తితోనే జీవిస్తూ వుండేవాడు. విద్యాగంధం లేని కారణాన, తనకు గౌరవం కావాలనీ, ఇతర్లుతనకంటే గొప్పేమిటనీ అనుకొనే వాడు గాడు. ప్రస్తుత ప్రభుత్వాల ధోరణివల్ల అందరూ చదువుకుంటున్నారు. కులాలు పోలేదు. కులాధిక్యతలూ, కులవైషమ్యాలూ తొలగలేదు. అందువల్లనే ఈనాడు విద్యార్థులు కులవృత్తులు స్వీకరించడం లేదు మన కులవ్యవస్థలో శరీర కష్టం చేయకుండా వున్న కులాలకే గౌరవం గాబట్టి. ఆ గౌరవం కావాలంటే కులవృత్తులు వదిలెయ్యాలన్న భావం కలిగింది.

ప్రతివాడూ శరీరకష్టంతో సంబంధం లేని ప్రభుత్వోద్యోగం గానీ, అదీ లేకపోతే ఫ్యాక్టరీల్లో ఉద్యోగంగానీ చేయాలనుకుంటున్నాడు. ఎంతమందికి లభిస్తాయి ఆ ఉద్యోగాలు! ఉద్యోగాల సంఖ్య ఒక కోటి వుంటే, ఇప్పటికి చదువుకొని ఉద్యోగార్హతలు గలవారు అంతకు అయిదారంతలున్నారు. దేశంలోని ప్రతివక్కడూ చదువుకోవాలి అన్న మన ప్రభుత్వ పథకం నూటికి నూరుపాళ్ళు ఫలిస్తే ఇక వృత్తులు చేసేవాళ్లెవరు? చెయ్యకపోతే ఉత్పత్తి ఎట్లా? ధరలు పెరుగుతూ పోయి తారాస్థాయినందుకున్నా, ఆ వస్తువుల ఉత్పత్తే ఆగిపోయే కాలం త్వరలో వస్తున్నది.

చదువు రానివాడు మాత్రమే వృత్తి చేస్తూ, చదివిన వాడంతా (శ్రమగౌరవం లేదుగాబట్టి) వృత్తిని వదిలేస్తూ పోతే — ఒక నాటికి — అంతా చదువుకొన్న నాటికి — వృత్తుల్లో వుండేవాడె వుండడు. ఉత్[illegible]లుండవు.

కాబట్టి ప్రజలూ, ప్రభుత్వము [illegible] జనులకు తలవంపులుగా వున్న తత్వాన్ని శాసనం ద్వారా రూపు[illegible] శ్రమగౌరవాన్ని తీసుకొస్తే తప్ప సమాజం ఇక ఒక దశాబ్దంలోనే [illegible] స్థితిలోకి దిగజారగలదు. ఎవడు [illegible] చేసినా దాదాపు సమానా[illegible] సమగౌరవం లభించే సమా[illegible] తక్షణం కల్పిస్తే తప్ప ఉత్పత్తులు తిని ఘోర దారిద్ర్యంలో [illegible] పోగలదు.

అందుకు అన్ని వెనుకబడిన [illegible] వారూ తమ తమ కులాలను [illegible] కుంటూ ముందుకు సాగిపోతూ, సమాజంలో — బృహత్సమాజంలో — [illegible] పోవాలని పట్టుపట్టాలి. [illegible] (Concrete) దృష్టితో — అంటే — [illegible] లావూ, తెలుపూ నలుపూ, [illegible] వాడూ, తెలివిలేనివాడూ, ఉన్న[illegible] లేనివాడూ — అన్న దృష్టితో [illegible]రించాలి గాని అనైంద్రికమయిన ([illegible] concrete) [illegible] మత శబ్దాలకు [illegible] కుండా ముందుకు నడిచి సా[illegible] సమసమాజ సృష్టికి దోహదం చెయ్యా[illegible]

ప్రభుత్వం కూడా చిత్తశుద్ధితో [illegible] చెయ్యాలి. సమసమాజ సంస్థాపనకు [illegible]వైన శాసనాలను తక్షణం చేసి, [illegible] అక్షరాలా చిత్తశుద్ధితో అమలుప[illegible] అమలుపరచలేని ఉద్యోగులపై క[illegible] కఠినమైన చర్య తీసుకోవాలి. [illegible] విరుద్ధంగా ప్రవర్తించిన ప్రజలను [illegible] అంతకంటే మించిన శిక్షలతో దండి[illegible] త్రాగగూడదని శాసించి [illegible] తాగుతూ వుంటే చూస్తూ — [illegible] దేవాలయ ప్రవేశం అని శాసి[illegible] పోనీకుండావుంటే చూస్తూ — వ్య[illegible] పనికిరాదని, అది జరుగుతూ [illegible] చూస్తూ — భూసంస్కరణలను ఉల్ల[illegible] వారిని సహిస్తూ వుంటే ఇక లాభ[illegible] పడదు. ప్రజాప్రభుత్వాలు సా[illegible] సమాజ సంస్థాపనకు చిత్తశుద్ధితో [illegible] చేస్తేనే ప్రజాప్రభుత్వ నామానికి [illegible]లవుతాయి. లేకపోతే కులవ్యవస్థ [illegible] ప్రభుత్వాలే అయిపోతాయి.

# రంగస్థల కళాభివృద్ధికి వెనుకబడిన తరగతులవారి సేవ

"సంస్కృతి బంధు"
ఎస్. వి. రమణరావు

భారతీయ కళలకు ఒక ప్రత్యేకత వుంది. కళలకు ఆధ్యాత్మికతను జోడించి భారతీయులు వాటిని ఆరాధిస్తారు. అందుకే అవి ప్రపంచకళారంగంలో ఒక విశిష్ట స్థానాన్ని సంతరించుకున్నాయి.

ఇంతటి మహోన్నత సాంస్కృతిక సంపదగల భారత దేశంలో కులతత్త్వపిశాచం తాండవించడం, దురదృష్టకరం. అంత ఉన్నతమైన జాతి అతి హీనమైనకుల మౌఢ్యంతో మానవతకు దూరం కావడం శోచనీయం. ఇది ఎంతవరకు వచ్చిందంటే భగవంతునికి ఒక రూపాన్ని కలుగజేసి ఆలయంలో నిలబెట్టిన శిల్పాచార్యుడు కులం కారణంగా ఆలయప్రవేశానికి అర్హుడు కాడనేంతవరకూ వ్యాపించింది. అయితే రంగస్థల కళలకు సంబంధించినంతవరకు ఈనాడు పరిస్థితి వేరుగావుంది. కళాకారులకు కులమతాలపట్టింపులేదు. కులానికి, మతానికీ అతీతంగా రంగస్థలాన్ని ఆరాధిస్తుంటారు కళాకారులు.

మొదట్లో, అంటే తెలుగునాట నాటక ప్రదర్శన ప్రారంభమైన తొలిరోజుల్లో సమాజంలో కళాకారులకు సరియైన ప్రతిపత్తి వుండేదికాదు. రంగుపూసుకున్నవారిని కులభ్రష్టుడిగ భావించేవారు. ఎందరో మహానటులు, పశువుల పాకల్లో నాటకానికి రిహార్సల్సు చేసుకున్న విషయం మరిచిపోలేము. నాటకాల్లో వేషాలు వేసేవారికి పిల్లనివ్వడానికి కూడా ఎవరూ ముందుకు వచ్చే వారుకారు. ఆరోజుల్లో నాటకాన్ని ఆదరించినా, నటులను మాత్రం హీనంగా చూడడం, జరుగుతూవుండేది.

వృత్తి చేతనైతేనేమి, బలహీనతవల్లనైతేనేమి రంగస్థలవృత్తి కళాకారులు తోటి కళాకారుల మధ్యనే వివాహాలు చేసుకుంటూ వుండడం పరిపాటి. అటువంటి సందర్భాలలో కులంపట్టింపు లేకపోవడం మూలంగా గాని సమాజం వారిని చిన్నచూపుచూడడం మూలంగాగాని కళాకారులకు కులంమీద ఏవగింపు కలిగింది. వారికి కులాలతో సంబంధంలేదు. కళారాధనే వారికులం.

అయితే వెనుకబడిన తరగతులకు చెందిన కళాకారులు రంగస్థలానికి చేసిన సేవను పరిశీలిస్తే ఎంతో వుంది. సామాజికంగాను, ఆర్థికంగాను కష్టనష్టాలను ఎదుర్కొని కళకోసం ఎంతో త్యాగం చేసిన మహనీయులు లేకపోలేదు. అటువంటి త్యాగధనులను సంస్కృతి సంరక్షకులను కళామూర్తులను హీనాతి హీనమైన కులంతో ముడిపెట్టడం ఉచితంకాకపోయినా ఈ సందర్భంలో చెప్పకతప్పదు.

తెలుగు దేశంలో రాజుల ఆస్థానాలలోను, జమీందారుల కొలువులోను కళాకారులెందరో తమ ప్రతిభను వెల్లడి చేసుకోవడమేకాక ఆ రాజ్యాల సాంస్కృతిక సంపదను పెంపు చేశారు. రాజాస్థానాలలోను, దేవస్థానాలలోను నర్తకీమణులుగా దేవదాసీలుగా తమ జీవితాలను అంకితం చేసుకొన్న విదుషీమణులు ఎక్కువభాగం వెనుకబడిన వర్గాలవారే! వారి నాట్యభంగిమలు శిల్పాచార్యుల ఉలులకు జీవంపోస్తే, కవి శేఖరుల గంటాలకు పదును పెట్టాయి. సమాజం వారిని చిన్నచూపు చూసినా వారుమాత్రం ముందు తరాలకు సాంస్కృతిక సంపదనందించి ధన్యులయ్యారు.

తెలుగునాట నాటక ప్రదర్శన ప్రారంభమై నూరు సంవత్సరాలు కావస్తున్నది. తెలుగు రంగస్థలంమీద ఎందరో గొప్ప కళాకారులు ఉద్భవించారు. దేశానికి కళలకు పేరు తెచ్చారు. వారిలో ఎందరో వెనుకబడిన తరగతులకు చెందిన కళాకారులున్నారు. తెలుగు రంగస్థలకళలలో ప్రత్యేకమైనది హరికథ సంగీతం, సాహిత్యం, నాట్యం ఈ మూడింటి మేళవించే హరికథ. ఈ కథాగానంలో చెప్పుకోదగ్గ కథకులు వెనుకబడిన తరగతుల వారిలో వున్నారు. హరికథా పితామహుడుగా పేర్గాంచిన ఆదిభట్ల నారాయణదాసు గారి సమకాలీకులు. అంతటి పండిత ప్రకాండులు, దాసుగారికి

ఆత్మీయులు అలున శ్రీ ఎరకయ్యదాసుగారు వెనుకబడిన వర్గానికి చెందినవారే! వారేకాదు, భాగలింగదాసుగారు, కోసూరి బాలబ్రహ్మానందదాసుగారు, పొడుగు పాడురంగదాసుగారు, మోపర్రు దాసుగారు, చేవూరి కనకరత్నదాసుగారు హరికథకులుగా ఎంతో కీర్తిగడించారు. ఈనాటికీ కడలి వీరదాసుగారు, సూర్యనారాయణభాగవతారు, కొచ్చెర్ల రామకృష్ణ భాగవతారు, ముదపాక మల్లేశ్వరరావు గారు వంటి కథకులు కథలకు మోజు తగ్గినా ఆ కళను వదలక సేవచేస్తూనే ఉన్నారు.

తెలుగువారికి నాటకం అంటే ఎంతో ఇష్టం. అటువంటి నాటకంలో కళాకారులు ఎక్కువభాగం వెనుకబడిన వర్గాలకు చెందినవారే ఉండేవారు. పౌరాణికాలు కానివ్వండి సాంఘికాలు కానివ్వండి తెలుగునాటకం పేరు చెబితే ముందుగా స్ఫురణకువచ్చేవారు సురభికళాకారులు. సురభి సమాజాలు ఈనాటికి తెలుగుదేశంలో గొప్ప నాటక సమాజాలు, క్షీణదశలో ఉన్న నేటి నాటకరంగంలో కూడా ఆ కళను వదలిపెట్టక కుటుంబ సభ్యులందరు పాల్గొని తెలుగు నాటకాన్ని బ్రతికిస్త చేస్తున్నారు. సురభివారు సురభి పెద రామయ్య, చిన రామయ్య, వనారస గోవిందరావుగారు, వనారస చితంబర రావు, బాలకొండ హనుమంతరావు, 110 సం.ల వయస్సుగల మహానటుడు వనారస వెంకోబారావు ఇటువంటి ఎందరో మేటి నటులు ఆ బృందాలకు జీవంపోశారు. నటీమణులు నాటకంలోనే కాక తెలుగు చిత్రసీమకు కూడ ఎంతో సేవచేసిన వారు లేక పోలేదు. వారిలో సురభి కమలాబాయి, పూర్ణిమ, బాలసరస్వతి వంటి పేర్గాంచిన నటీమణులు సురభివారే.

సురభి వారినీ, మరికొన్ని మహారాష్ట్ర నాటక సమాజాలను దృష్టిలో పెట్టుకొని తెలుగుదేశంలో ఎన్నో నాటక సమాజాలు స్థాపించబడ్డాయి. వాటిలో ఎందరో మహనీయులైన నటీనటులు తయ్యారయ్యారు. వై. వీరభద్రాచారి గారు హరిశ్చంద్రుడు వేస్తే ఆ పాత్రకు జీవంపోసినట్లుండేదట. మునిపల్లె సుబ్బయ్యగారు, ఎ. వి. సుబ్బారావుగారు మహానటులుగా నాటకరంగంలోనే కాక చలనచిత్రరంగంలో కూడా మొట్టమొదట పేరుతెచ్చిన మేటినటులు. గుంటూరు [illegible]మిత్ర సమాజంలోనూ, కాకినాడ యంగ్ మెన్స్ క్లబ్‌లోనూ [illegible] పి. లక్ష్మణస్వామి, శేకి అనసూయ, వై. వీరభద్రాచారి వంటి ప్రముఖులు తెలుగు నాటక రంగాన్ని పరిపుష్ఠ చేశారు. ఆ రోజుల్లోనే దామ్మేటి నోదలలు సత్యనారాయణగారు స్త్రీ పాత్రలు ధరిస్తే, సూర్యనారాయణగారు క్రూర పాత్రలు వేస్తుండేవారు. ఇందుపల్లి గోవిందరావు స్త్రీ పాత్రలు ధరించి సెభాస్ అనిపించుకున్నారు. అలాగే శ్రీరంజని, రామతిలకం, గంగారత్నం, లుష్యేంద్రమణి, సరసీరుహం, దాసరి కోటిరత్నం, చేబ్రోలు సరస్వతి వంటి నటీమణులు ఎందరో రంగస్థలానికి సేవ చేశారు. పి. సూరిబాబు శ్రీమతి రాజేశ్వరి వారి రాజరాజేశ్వరీ నాట్యమండలితో తెలుగు నాటక రంగానికి ఎంతో [illegible] తెచ్చారు, సూరిబాబు గాత్రం తెలుగు సంగీత సీమలో విశిష్టమైనటువంటిది. తారాశశాంకం, భూకైలాస్ వంటి పౌరాణిక నాటకాలకు జీవంపోశారు. శ్రీ సూరిబాబు నాటక సమాజం వారు ఆ సమాజం మూసివేయడంతో తెలుగుదేశంలో నాటక రంగానికి వెలితి ఏర్పడింది.

పౌరణికాలయుగంలో రఘురామయ్యగారికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఆయన గొప్పనటుడుగా, గాయకునిగా, సంగీతజ్ఞుడిగా యావద్భారత దేశాన్ని ఉర్రూతలూగించిన మేటి కళాకారుడు. గురుదేవుడు రవీంద్రనాథ్ టాగూర్‌చే "నైటింగేల్" గా ప్రశంసింపబడి, తెలుగు నాటక రంగానికి ఎనలేని కీర్తిని ఆర్జించి పెట్టారు. ఆయన నాటక రంగంలోనే కాక చలన చిత్రరంగంలో కూడ ప్రవేశించి ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నారు.

కాకినాడ యంగ్ మెన్స్ హాపీక్లబ్ నుండి వచ్చిన మేటినటులలో శ్రీ రేలంగి వెంకట్రామయ్య ఒకరు. ఆయన అటు నాటక రంగంలోనూ, ఇటు సినీరంగంలోనూ హాస్యానికి మరోపేరుగా రూపుదాల్చి, "హాస్యనట చక్రవర్తి" గా పేరు గాంచారు. ఈ కోవలో చెప్పుకోవాలంటే చిత్రనిర్మాతగా మారిన కడారు నాగభూషణం, ఆ రోజుల్లో నాటక రంగానికి ఎంతో సేవచేశారు. విజయవాడకు చెందిన నల్లంచి అప్పారావు, నల్లంచి దుర్గారావు, కె. నాగేశ్వరరావు, కాపారపు పెంటయ్య, పులి కోటయ్య కళారంగానికి సేవచేసిన ప్రముఖులు.

అంజనేయ పాత్రకు పేరుగాంచిన జేతా వెంకటరావును ఈ సందర్భంలో విస్మరించలేము. ఆయన యావద్భారత దేశంలోనే అంజనేయునిగా చిర కీర్తి నార్జించారు.

ఈ నాటికీ వెనుకబడిన తరగతులవారు ఎందరో కళారంగానికి సేవచేస్తూనే వున్నారు. అందులో, కర్రి అబ్బులు, షణ్ముఖి అంజనేయరాజు, ఎ.వి. సుబ్బారావు, అక్కినాచార్య, జనావీరభద్రరావు, చెంచు రామారావు, పృథ్వీ వెంకటేశ్వర్లు, జైరాజు, దుర్గాప్రసాద్ వంటి హేమాహేమీలు, ఇంకా కొన ఊపిరితోవున్నా పౌరాణిక నాటకరంగానికి జీవం పోస్తున్నారు.

అదేవిధగా సాంఘిక నాటక రంగంలో వెనుకబడిన తరగతులకు చెందిన కళాకారులెందరో వున్నారు. రంగూన్ రౌడి, సాని—సంసారి, వంటి నాటకాలలో రౌడి పాత్రలకు పేర్గాంచిన వారు శ్రీ కోడూరిపాటి రామారావు, ఈనాటి సుప్రసిద్ధ చలనచిత్ర కళాకారులు రాజేశ్వరరావు, శ్రీ చలం, శ్రీ మాడా వెంకటేశ్వరరావు, శ్రీమతి శారద, శ్రీమతి వాణిశ్రీ వంటి గొప్ప నటీనటులు తెలుగు నాటకరంగాన్ని సేవించినవారే.

పౌరాణిక నాటకాల ప్రాబల్యం తగ్గిన తరువాత, సాంఘికాలపై మోజు ప్రబలించింది. నాటక రచయితలు, నటులు సాంఘిక నాటకాలవైపు మళ్ళారు. అప్పటికి విద్యార్థికులు నాటకాలపట్ల అభిమానంతో ముందుకు

వచ్చారు. ఈ దశాబ్ది ఉత్తరార్థంలో సాంఘిక నాటకాలకు క్రొత్త రూపాన్ని సంతరింపచేసిన కళాతపస్వి డా. గరికపాటి రాజారావుగారు, డా. రాజారావు గారు నటుడుగా దర్శకుడుగా, ప్రయోక్తగా ఒక క్రొత్త పంథాను నాటక రంగంలో సృష్టించి ఎందరో మహానటులను తయారుచేశారు. ఆయన నాటక రంగంలోనేకాక, చిత్రరంగంలోకి కూడ ఎందరో కళాకారులను తీసుకొనివచ్చారు.

విద్యార్థికులు, ఉద్యోగులు ప్రోత్సాహికులుగా నాటక రంగాన్ని సేవిస్తున్నవారు ఎందరో వున్నారు. వారిలో వెనుకబడిన తరగతులకు చెందిన వారు కూడా అధిక సంఖ్యలో వున్నారు. అటువంటి వారిలో శ్రీ జె. వీరాస్వామి, శ్రీ బి. రామారావు శ్రీ ఎల్. భక్తవత్సలం, శ్రీ కె. వీరాస్వామి ప్రముఖులుగా చెప్పుకోవచ్చు.

సాంస్కృతికరంగంలో ఎందరో కళాకారులకు చేయూత నిచ్చిసాంస్కృతిక పునర్జీవనానికి తోడ్పడిన వారిలో చెప్పుకో దగ్గవారు, శ్రీ సుంకర కనకారావుగారు ఒకరు. ఆధునిక కాలంలో వృత్తి నాటక సమాజాలు మూలపడినా, ప్రోత్సాహికులు ముందుకు రావడం ఒక విధంగా మంచిదే అయింది. ఈనాడు ప్రోత్సాహికులలో ఎందరో కళాకారులు, రచయితలు, సాంకేతిజ్ఞులు వున్నారు. బహుళసంఖ్యాకులైన ఈ వెనుకబడిన వర్గాలవారు సాంస్కృతిక రంగంతోపాటు అన్ని రంగాలలోనూ ముందుకు వచ్చి శ్రేయోరాజ్య స్థాపనకు కారణభూతులవుతారనడంలో సందేహం లేదు.

---

# బలవంతులు సృష్టించిన దుర్బలులు

రావూరి రవీంద్రనాథ్.

"ఆదికాలమున మానవులందరు అన్నదమ్ములండీ!"

నిజమే!

ఆదికాలంలో మానవులందరూ సమష్టి జీవనం చేస్తూ ఉండేవారు. అందరూ కలిసి పనిచేసేవారు. ఆ పని ఫలితాన్ని అందరూ సమానంగా అనుభవించేవారు. ఇదేదో ఏవొక్క ప్రాంతంలోనో ఉండేదనుకోరాదు. ఆనాటి సమాజంలో ఈ వ్యవస్థ కొంతకాలంపాటు ఉన్నది. ఇలాంటి వ్యవస్థ ఉన్నదాన్ని "గణం" అనేవారు. ఉత్తర భారతంలో, ఇలాంటి గణరాజ్యాలు కొన్ని ఉన్నాయి. ఈ రాజ్యంలోని పౌరులందరూ సమానులే! ఒకరు ఎక్కువా మరొకరు తక్కువా అన్నదిలేదు. కానీ, ఈ వ్యవస్థ ఎక్కువకాలం ఉండలేక పోయింది. స్వార్థపరులైన రాజులు, ఈ గణ రాజ్యాలను నాశనం చేశారు. అనాది ప్రజాస్వామిక వ్యవస్థలు అణచివేయ బడ్డాయి.

బలవంతులైనవారు ప్రభువులను ఆశ్రయించారు. బలహీనులు వెనుకకుతోసివేయ బడ్డారు. ప్రభువులను ఆశ్రయించిన వారు, సుఖభోగులయినారు. బలహీనులయిన వారు శ్రామికులయినారు.

అనాది కాలంలోని "పని విభజన" విధానం, రానురాను కులాల కిందికి మారి పోయిందని, సామాజిక శాస్త్రవేత్తల అభిప్రాయం. కొన్ని పనులు చేసేవారు, ఎక్కువ వారు. ఇంకొన్ని రకాల పనులు చేసే వారు తక్కువవారు.

చిత్రమేమిటంటే, ఈ తక్కువవారే సమాజంలో ఎక్కువగా ఉన్నారు. వీరే సమాజానికి పునాది రాళ్ళ వంటివారు. సామాజికమైన సంపదలను సృష్టిస్తున్న వారుకూడా వీరే! వీరు సృష్టిస్తున్న సంపద, వీరి అనుభవంలోకి రావడం లేదు. దాన్ని మరొకరెవరో దోచుకు పోతున్నారు. ఇంకెవరో దొంగిలిస్తున్నారు.

"భారతదేశం గ్రామాలలో జీవిస్తున్నది" అన్నారు బాపూజీ.

ఈ గ్రామాల నిండా ఉన్నది ఈ బడుగు వర్గాలవారే! మంగలి, కమ్మరి, కుమ్మరి, సాలె, మేదరి, బెస్త, నాయీ బ్రాహ్మణ, యాదవ, రజక, మొదలైన వృత్తుల వారందరూ, అధిక సంఖ్యలో గ్రామాలలోనే ఉంటున్నారు. వీరిలో చాలా మంది గర్భదరిద్రులు. తినడానికి బుక్కెడు తిండిగానీ, ఉండేందుకు బారెడు నీడగానీ లేనివారు. తమతమ వృత్తుల వల్ల జీవనం సాగక, ఆ వృత్తులను విడిచిపెట్టలేక, సతమత మవుతున్న వారు.

సామాజిక జీవనం, సక్రమంగా సాగడానికి ఈ వృత్తుల వారందరూ అవసరమే! ఏ వొక్కరు లేక పోయినా, ఆ వెలితి, కొట్టొచ్చినట్లే కనబడుతుంది. ఈ వృత్తులవారే కాక, అసలు ఏ వృత్తి లేనివారు, వ్యవసాయ కూలీలుగానూ, సంచారజాతులుగానూ జీవనం గడుపుతున్నారు.

మన రాష్ట్ర జనాభానుబట్టి చూస్తే, సగానికి పైగా, వెనుకబడిన వర్గాలవారూ, బలహీన వర్గాలవారూ ఉన్నారు. వీరందరూ శతాబ్దాలుగా, ఈ కూప జీవితం జీవిస్తున్నవారే! తామెంత అధమాధమ స్థితిలో బతుకుతున్నదీ తెలియనంత అజ్ఞానంలో, అమాయకత్వంలో, వీరింత కాలం రోజులు వెళ్ళబుచ్చుతున్నారు.

వీరి అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని ఇతరులు ఉపయోగించు కొంటున్నారు. వీరి శ్రమను ఇతరులు దోచు కొంటున్నారు. పొలందున్ని, పంట పండించి, ధాన్యపు రాసుల్ని బస్తాలకెక్కించి, భూస్వామి భవంతికి చేర్చిన బడుగుకూలీలు, బువ్వకోసం, ఆ బుగతనే యాచిస్తున్నారు. పత్తి పండించిన వాడొకడు. దారంతీసి, వస్త్రాలుగా మార్చిన వాడొకడు. ఆ పండించినవాడూ, ఈ వస్త్రాలు నేసినవాడూ, అర్థ నగ్నంగానే బతుకుతున్నారు. గొర్రెలు, మేకలు, కాసేదీ, ఉన్నిని కత్తిరించేదీ వొకడు, ఆ ఉన్నితో దుస్తులు తయారుచేసేది మరొకడు. కానీ, ఆ గొర్రెలకాపరీ, ఈ దుస్తుల తయారీదారుడూ వాటిని చూసి ఆనందిస్తున్నారే గానీ, ధరించడానికి నోచుకోవడం లేదు.

SURJIT SINGH BARNALA.
*Minister,*
*Agriculture and Irrigation, India.*

NEW DELHI
20*th April,* 1979.

I am glad to know that the Andhra Pradesh Government is organising a Conference of the State Backward Classes during this Month I wish Conference all success.

SURJIT SINGH BARNALA.

# అధునాతన ప్రపంచంలో కులవృత్తు

# ప్రజల సాధక బాధకాలు

ఆకురాతి వెంకటేశ్వరరా

కులం ప్రాతిపదికగా వృత్తిని కొనసాగిస్తూ, పొట్టపోసుకునే మానవులు ప్రపంచంలోని బడుగు దేశాలలో పెక్కుచోట్ల ఈనాటికీమనకు కనిపిస్తూనే వుంటారు. ఇలాంటి ప్రజలు అభివృద్ధి చెందుతున్న దేశాలలోకూడా అనేకమంది వున్నారు. వంశ పారంపర్యంగా వస్తున్న వృత్తి నైపుణ్యాన్ని అధారం చేసుకొని వీరు సునిశితమైన మరియు నిత్య జీవితంలో మనకు ఎంతో ఉపయోగకరంగా వుండే చేనేత వస్త్రాలు, చెక్కబొమ్మలు, తాటాకు బుట్టలు, ఎదురీత చాపలు, లోహపు వంట సామాగ్రి, స్త్రీలు ధరించే ఆభరణాలు, మట్టి కుండలు, వంటి అనేకమైన వస్తు సామాగ్రిని ఎంతో కళాత్మకంగా తయారుచేసి, వాటిని అమ్ముకుంటూ తమ జీవనభృతిని ఆర్జిస్తారు. ప్రపంచం మారింది. దానితోపాటు మానవుడుకూడా ఎన్నో అడుగులు ముందుకు వెళ్ళాడు. గ్రామీణ పరిశ్రమ కుంటుపడింది. యంత్రాలు మానవశక్తిని హెచ్చుగా కోరకుండానే తక్కువకాలంలో ఎక్కువ సంఖ్యలో వస్తువులను తయారుచేయగలుగుతున్నాయి. యంత్రాలపై యీనాటి మానవుడు హెచ్చు భాగం ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది. మరి యీ పరిస్థితుల్లో పురాతన కాలంనుండి వస్తున్న కళాసంపదను పోషించుకుంటూ, తమ శారీరకశక్తిపై ముఖ్యంగా తమ వేళ్ళమీద, కాళ్ళమీద, ఆధారపడి వృత్తులను చేసుకుంటూ బ్రతికే ప్రజల మనుగడ ఒక విధంగా చూస్తే కొంత క్లిష్టంగా తయారైందనే చెప్పాలి.

ప్రజలు మోజుపడి యంత్రాలు తయారుచేసిన నాజూకైన కంటికి ఆకర్షణీయంగా వుండే కృత్రిమ పద్ధతుల్లో తయారుకాబడిన వస్తువులను హెచ్చుధరలు యిస్తూనైనాసరే కొనుక్కునేరోజులివి. అంతేగాదు, యంత్రాలు అనుదినం మనం వాడుకునే అనేక వస్తువులను అతి తక్కువ దరలతోకూడా తయారుచేయగలవు. ఇలాంటి యంత్రాలతో చేతివృత్తులపై ఆధారపడి జీవించే కళాకారులు అనుదినం పోటీ పడడం సరి అయింది, ఈ అణుయుగంలో. ఈ సత్యాన్ని దృ వుంచుకొని కోట్ల కొలది ప్రజలు యీ కుల వృత్తులపై ఆ పడ్డారన్న విషయాన్ని గ్రహించి వీరికి యంత్రాలపోటీ కొన్ని రక్షణలు కల్పించాలనే వుద్దేశ్యంతో మన ప్రభ వారు యిట్టి ప్రజలను వెనుకబడిన కులాల తరగతులకు వారుగా ప్రకటించడం జరిగినది. వృత్తి రక్షణలతో వెనుకబడిన తరగతుల కులాలకు చెందిన వారి క్షే ప్రభుత్వం వారు చట్టరీత్యా అనేక వసతులను,సదుపాయవ ఏర్పాటు చేయడంకూడా జరిగినది. ఈ కుటుంబాలకు పిల్లల చదువులకై ఆర్థిక సహాయం చేయడం, యీ కుటు వారికి ఉద్యోగావకాశాలు కల్పించడం, వీరికి గృహ కల్పించడం, వంటి చర్యలు వీటిల్లో పేర్కొనదగినవి బడుగుప్రజల భవిష్యత్తుకు ప్రభుత్వం వారి కృషి నిజంగ నందనీయమే.

ఆయితే యీ వెనుకబడిన తరగతికి చెందిన ప్రజలు తమ కుల వృత్తులను నిర్విఘ్నంగా కొనసాగించుకోవ ప్రభుత్వంవారు పంచవర్ష ప్రణాళికలద్వారా అనేక పథక తయారుచేసి ఎన్నో సదుపాయాలను చేసినప్పటికి ఒక వుత్పత్తులలో యంత్రాలతోను మరొకవైపు ఉత్పత్తి వస్తువుల విడుదలలో పైరిపేటు రంగములో పనిచేసే వ్యాపారస్తులతోనూ, వీరు విపరీతమైన పోటీని ఎదుర్ వలసి వస్తున్నందున, ముందురోజులలో ప్రభుత్వం వారు కులాలవారికి యితోధికంగా సహాయపడి వీరికి చేయూ వలసిన అవసరం ఎంతైనా వుంది.

వెనుకబడిన తరగతులవారు వృత్తులు కొనసాగిం డానికి వారువాడే ముడి పదార్థములను సకాలములో,సర

---

* చీఫ్ రిసెర్చి అండ్ డెవెలప్మెంటు ఆఫీసరు, ఆంధ్ర రాష్ట్ర చేనేత సహకార సంఘం.

